ఆంధ్రదేశమంతటిలోను సంక్రాంతికి

విడుదలగును

# జెమిని

# చక్రధారి

మనసును కలచివేయు అద్భుతసంఘటనలతో

నిండిన అపురూప చరిత చిత్రము

ఇప్పుడు మద్రాసులో క్రౌన్. స్టార్ థియటరులలోను

ఇతర ముఖ్యకేంద్రములలోను ప్రదర్శింపబడుచున్నది

నాగయ్య. పుష్పవల్లి. నారాయణరావ్ నటించినది..... డైరెక్షన్: K.S. గోపాలకృష్ణన్



# విషయసూచిక





## గృహలక్ష్మి పాకకళ

శాస్త్రయుక్తమగు పాకకళా రహస్యములను తొలుత "గృహలక్ష్మి"లోను, పిదప పుస్తక రూపముననను ప్రచురింపవలయునని మా యుద్దేశము అందువలన పాక కళావేత్తలైన "గృహలక్ష్ములు" తమ అనుభవముల ననుసరించి వివిధపాకవిశేషముల తయారుచేయు విధానమును, తమ చిత్రములను తప్పక పంప ప్రార్థితులు.

గృహలక్ష్మి సంపాదకులు

GRIHALAKSHMI

# గృహలక్ష్మి.

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస. పత్రిక

సంపాదకుడు:

డాక్టరు కే. యన్. కేసరి

సంపుటము ౧౨] జనవరి 1949 [సంచిక ౧




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# WE LOOK BACK WITH PRIDE AND AHEAD WITH CONFIDENCE




## ‘కేరళ’ మేలుసరకు

1. సాండల్ వుడ్ —దేహకాంతిని పెంపొందించును: అసలైన చందనతైలంతో చేయబడినది.
2. విల్లింగ్డన్ —అందరు మోజుపడేది, నాజూకైనది, ఒళ్లుతోముకొనే సబ్బు.
3. రోజ్ —చౌకలో ప్రసిద్ధిగన్న రోజావాసనగల్గి ఒళ్లుతోముకొనుటకుపయోగించేసబ్బు.
4. వేప్ —వాసన తొలిగించిన వేపనూనెతో, చర్మ పరిశుభ్రతకై తయారు చేయబడిన మేలురకము సబ్బు.
5. కోల్ తార్ —చర్మవ్యాధులు కల్గించే క్రిమినాశనకారి.
6. వాష్ వెల్ బార్ —గుడ్డలను బాగుగాను, శుభ్రముగాను ఉతకవచ్చును, చౌక.
7. షేవింగుస్టిక్ బేక్‌లైట్ కేసులో —బాగా నురుగువస్తుంది అందరూ మెచ్చుకొని వున్నారు.
   (ఇదివరకే కేసులతో కొనిఉంటే వట్టిస్టిక్కే విడిగా కొనవచ్చును.)

**KERALA SOAP INSTITUTE, CALICUT.**



ఉత్తానకరవేణుక




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# స్వవిషయం

"గృహలక్ష్మి"కి గతమాసముతో 17 వ సంపుటం ముగియగా ఈ నెలనుండి 18 వ సంపుట మారంభమైనది. యుద్ధకాలంలో నిద్రావస్థకూడ కలుపుకోగా నిజానికి "గృహలక్ష్మి"కి 21 సం॥లు నిండవస్తున్నవి. 1947లో "గృహలక్ష్మి" తిరిగీ తెలుగు పత్రికా ప్రపంచంలోనికి పునరాగమన మొనర్చినది మొదలు నడచిన వివరములు వేరొకచో వ్రాసియున్నాము. ఆంధ్ర గృహలక్ష్ములు ఈ 21 సం॥లుగా నేవాత్సల్యమున నీ "గృహలక్ష్మి" పత్రికా పుత్రికను ఆశీర్వదించి, లాలించిరో—ఆ వాత్సల్యాతిశయముననే, ఇంకను దీని నరయుదురుగాక యని అభిలషిస్తున్నాము. "గృహలక్ష్మి" యున్నా తదను గుణ్యంగానే ఆంధ్రమహిళా ప్రపంచమును సేవించ గలదని మరొక్కమారు నొక్కివక్కాణిస్తున్నాము.

రోజులు మారినవి; మారుచున్నవి. స్వాతంత్ర్య సిద్ధితో, — స్త్రీ పురుషులకు హక్కులు, బాధ్యతలు హెచ్చుతూఉన్నవి. వద్దన్నా, కద్దన్నా వయోజన నియోజక వర్గములేర్పడి ఎన్నికలు సాగునప్పటికి—మన రాజ్యాధికారము నిర్ణయించి, సాగించే కర్తలు

మనమే అవుతున్నాము. అంటే స్త్రీలున్నూ అందు సమానభాగస్వామ్యము పొందుతున్నారు. ఈ రోజుల్లో రాజ్యము అంటే—లౌకిక రాజ్యము; - అనగా, – మానవ జీవితంలో రాజ్యాధికారం జోక్యం కల్గించుకోనట్టిదీ, నిరూశించనట్టిదీ, నియమనిబద్ధం చేయనట్టిదీ అంటూ ఒక హంశమున్నూ ఉండబోదు. అట్టిరాజ్యం ప్రజారాజ్యమైనపుడు ఆ 'ప్రజ' ఎంత వివేకసంపన్నం కావాలో చెప్పనక్కర లేదు. ముఖ్యంగా వెనుకబడిఉన్న స్త్రీ వర్గం అతివేగంగా అభివృద్ధి గాంచవలసి యున్నది.

యుద్ధానంతరం - ఏర్పడ్డ పరిస్థితులవల్ల జీవితమంతా కట్టుబాట్లకులోనైనది. క్రమశిక్షితంగాని ప్రజ ఈ స్థితి నవగాహనం చేసుకొని, వాని అవలంబించి—సుఖసౌఖ్యములు పొందజాలదు.

నేడు ప్రపంచంలో ఏవ్యక్తిన్నీ తనచుట్టూ గిరిగీచుకొని, అందుముక్కుమూసుకొని కూర్చుండి ఆనందించడానికి వీలులేదు. శాస్త్రవిజ్ఞానాధిక్యతచేతనైతేనేమి, మానవుని ఆశాపాశములచేతనైతేనేమి ఉత్తరధృవము, దక్షిణధృవము ఒకటికొకటి అత్యంతము సమీపమైనవి. ఇన్నాళ్లున్నూ బాహ్యప్రపంచ మెరుగని భారతీయ ప్రజాసామాన్యము, అందును ఎన్నడు ఇల్లువిడిచి ఎరుగని స్త్రీవర్గము ఈనూతనపరిస్థితులను గ్రహించి, సర్దుకొని, తామభివృద్ధిచెంది, భారతమాతవ్యవహారముల నభివృద్ధిపరచి, ప్రపంచవ్యవహార రంగంలో భారతమాత కున్నతస్థానాన్ని సాధించవలసియున్నది నాడే, ప్రపంచములో శాంతి సౌఖ్యాలు స్థిరపడతాయి.

కాబట్టి "గృహలక్ష్మి" ఆయా విషయములను ఆకళింపునకు తెచ్చుకొని— అందుకనుగుణ్యమైన కథలు, నాటకాలు, వ్యాసాలు, పద్యాలు, పాటలు, వినోదాలు మున్నగునవి రచించి పంపిస్తూ రావలయునని మనవి చేస్తున్నాము.



# సంక్రాంతి

"గృహలక్ష్మి" పాఠకులు సంక్రాంతిపండుగ ఉత్సవ వ్యగ్రులైయుండగా నీ "గృహలక్ష్మి" సంచికను కాంచనున్నారు. సంక్రాంతిపండుగ ఆంధ్రదేశమునకు-తెలుగు జాతికి - స్వకీయజాతీయోత్సవము. భోగినాడు పాతద్రవ్యముల దగ్ధముచేయుట, పిల్లలకు ఆయుర్వృద్ధికరముగ పండ్లుపోయుట, అభ్యంగనము, నూతనవస్త్రధారణము, సంక్రాంతిని పితృదేవతల నారాధించుట, కూష్మాండదానము, జోగిజంగములకు బిచ్చములుపెట్టుట, కనుమ, ముక్కనుమ రోజులలో, గోపూజ ఆటలపోటీలు, వరుసగా జరుగుచున్నవి. కొన్నిప్రాంతముల బొమ్మలనోమనియు, మరికొన్నిప్రాంతముల గొబ్బెమ్మను పెట్టుకొనుట

యనియు - ఉత్సవములు గావింతురు. ఆ కొలువులలో అపరూపమైన పనితనముగల వస్తువులు, బొమ్మలు ప్రదర్శింపబడుచుండును. మరియు ఆంధ్ర దేశమున అన్ని ప్రాంతముల వరిధాన్యము నూర్పిళ్లై ఇండ్లకు చేరును. బంగారము రాసిపోసినట్లుండు ఆ ధాన్యలక్ష్మి ఎవ్వరికి సంతోషదాయకము కాదు! మెట్టపొలములలో కాయకూరలు సమృద్ధిగా నుండును. జొన్నవరి రాగి మున్నగు పైర్లు కంకులువిడిచియు, గింజ పాలు పోసికొనియు కండ్లకింపుగా నుండును. కొతిమెర పొలాలపైనుంచి కమ్మని సువాసనలు జమ్మని విసరుచుండును. శనగ, పెసర, కంది, - మున్నగు కాయ ధాన్యములు కాయవిడచి గింజముదురుచుండును. దోరగానున్న ఆ పచ్చిగింజలు వలిచితినుట కెంతో రుచికరముగా నుండును. పచ్చగా దోసపండ్లు పండి చేలంతయునిండి చూచుటకే పండ్లుపులియు చుండును. ఆపొలముల నొక్కసారి పారజూచిన భాగ్యలక్ష్మి తాండవించుచుండును. పశువులును సమృద్ధిగ పాడిగల్గియుండుకాలమిది. బంతి, చేమంతిపూలు ఎచ్చటజూచిన విచ్చల విడియై జడల, కొప్పులనిండి సువాసనల గుప్పుచుండును.

అయితే నేడు దుష్కాలముగనున్నది. ధాన్యపుకంట్రోలు కంఠమునొక్కివేయు చున్నది. పండుగకైన క్రొత్తగుడ్డదొరుకుట కష్టమగుచున్నది. పాడియును మందగించినది. గృహావసతియు కుతిక బిగుసుకొనినట్లున్నది. పంచదారయు అంగళ్లలో మూడు రోజుల కొకసారి దాగుడుమూతలాడుచుండును. ఆంధ్రజాతి చిరకాల వాంఛితమగు ఆంధ్రరాష్ట్ర సిద్ధికంతరాయము కలుగుచున్నదనియు, సస్యానుకూలమొనర్చి, పరిశ్రమల పెంపొందించు రామపాదసాగర, తుంగభద్ర ప్రాజక్టులు వెనుకబడ్డవనియు, ఆంధ్రులకొక కొన్ని తీరని చింత లేర్పడియున్నవి.

కాని అల్పసంతోషమునకు పెట్టినపేరు తెలుగుజాతి. ఉన్నంతలో తృప్తిపడి యుత్సవము గావించుకొనుటలో వారి కెవ్వరు సాటిరారు. కావున — అట్లు మా పాఠకులు ఉత్సవవ్యగ్రులైయుండగా వారి హస్తముల నీ సంచిక అలంకరింపగలదని విశ్వసించు చున్నాము. సంక్రాంతి పురుషుని చలవన, గొబ్బెమ్మ దయవలన – రాగల సంక్రాంతి నాటికైన మనకీ యిక్కట్టు లన్నియు తీరుగాక.



# మహాభారత ప్రశంస

శ్రీమతి కాకుటూరు పద్మావతిగారు

"కమలక్కయ్యా! ఏంజేస్తున్నావు?" అంటూ ప్రవేశించింది సీత. సీత పన్నెండేండ్ల బాలిక. ఈ సంవత్సరమే సెకండు ఫారములో చేరింది. చురుకైనపిల్ల.

"రా! సీతా! యివాళ మీకు సెలవుగదా!" అన్నది కమల చదువుచున్న పుస్తకాన్ని టేబిల్ మీద పెట్టి.

"అవునక్కయ్యా! యీ రోజు సెలవే. యీ శనివార ఆదివారములువస్తే నీ దగ్గర ఏవైనా క్రొత్త సంగతులు తెలుసుకుందామని సరదా. నీవు చెప్పిన విషయాలు నా మనస్సుకు బాగా బోధపడుతాయి. విసుక్కోకుండా నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పుతావు. అందుకని అన్నం తినగానే వచ్చేశా! బావగారు భోంచేసి వెళ్లారా!"

"వెళ్లారు సీతా! వారట్లా వెళ్లంగానే యింటిపనులన్నీ ముగించుకొని యిప్పుడే చదువుకోడానికి కూర్చున్నా ఇంతట్లోనే నీవు వచ్చావు"

"నీవు చదువుతుండే పుస్తక మేమిటి?"

"మహాభారతం. దీనిలో వేదార్థములు, ధర్మశాస్త్రములు అన్నీ నీతి కథల రూపంగా బోధపడేటట్లు రచింపబడ్డది."

అక్కయ్యా! దీనిని రచించిన దెవరు?

'దీనిని సంస్కృత భాషలో వేదవ్యాస మహర్షి రచించారు. సంస్కృత భాషనే గీర్వాణభాష అని కూడా అంటారు. యీ కావ్యమంతా శ్లోకములతో నిండివున్నది. దీనిని గొప్ప గొప్ప కవీశ్వరులు అన్ని భాషలలోకి మార్చారు."

"అయితే నీవు చదివేది సంస్కృత గ్రంథమేనా?"

"కాదు సీతా! సంస్కృతం నాకురాదు తెలుగులోనే చదువుతున్నా! ఇది తెలుగు కావ్యం."

"యీ కావ్యాన్ని తెలుగులో వ్రాసిన వారెవరు?"

"చెప్తా! సీతా! యీ గ్రంథాన్ని తెలుగుభాషలోనికి మార్చినవారు ముగ్గురు కవీశ్వరులు. తిక్కన సోమయాజి, నన్నయభట్టు, యఱ్ఱాప్రగడ అని. వీరుగాక కందుకూరి వీరేశలింగంపంతులుగారుకూడా యీ కావ్యాన్ని పద్యకావ్యంగా వ్రాశారు ఇంకా వచనకావ్యాలుగా నాటకాలుగా అనేకమంది కవులు ఎన్నో విధాలుగా రచించారు"

"అక్కయ్యా! యీ గ్రంథం చిన్నదిగానేవుంది. నీవు త్వరగానే చదివేస్తావు!"

కమల నవ్వి, "కాదు! సీతా యీ గ్రంథం చాలా పెద్దది. మహాభారతము పదునెనిమిది పర్వములతో గూడుకొన్నది. పర్వము అంటే మామూలుగా పండుగఅని అర్థము. ఇక్కడ గణుపుఅని. భారతమును చెఱకుగడతో పోల్చి వాటి గణుపులను పర్వములని అంటారు. చెఱకుగడ ఎంత తియ్యని రసమును గలిగి వుంటుందో అట్లే యీ భారతంకూడా అంత మాధుర్యంగా నుంటుందని వర్ణించారు యీ కావ్యామృతాన్ని సేవించిన పండితులు. ఇప్పుడు నేను చదువుచున్న పుస్తకం ఒక పర్వము మాత్రమే! మీ వాచకములలో పాండవులను, కౌరవులను గురించి నీవు చదివిన కథలు మహాభారతంలోనివే.

"అయిదవ తరగతి మొదలుకొని వీరిని గురించిన కథలు చదువుతునే వున్నాను. ఈ సంవత్సరము కూడా కొన్ని పద్యాలు చెప్పుతున్నారు మా స్కూల్లో."

"అంతేగాదు సీతా! పోయిన నెలలో నేను నిన్ను కొన్ని ఉపన్యాసములకు తీసుకొని వెళ్లాను, జ్ఞాపకముందా! అక్కడ జరిగినవి భగవద్గీతను గురించిన ఉపన్యాసములు. పాపం నీకు ఏమీ అర్థం

తెలియకున్నా నేను రమ్మని పిలవగానే నాకు తోడుగా సరదాగా వచ్చావు. ఆ భగవద్గీతలు యీ మహాభారతంలోనివే.”

భగవద్గీతలని విన్నాను అక్కయ్యా! ఆ పుస్తకాన్ని మా నాన్నగారు ప్రతిరోజూ పారాయణం చేసుకుంటారు.

“అవునవే, ఈ మహాభారతంలో ఏమీ తెలియని అజ్ఞానులు ఏమేమి చెయ్యాలో, అన్ని జాతుల వారికి, అన్ని మతములవారికి అన్ని తరగతులవారికి, పిల్లలకు, పెద్దలకు, జ్ఞానులకు అందరికీ చేయదగిన ధర్మాలు వున్నాయి. ఎన్నో చక్కని నీతికథలున్నాయి. చదువుతుంటే ఎంతో ఆనందం కలుగుతుంది. అయితే యిలాంటి గ్రంథాలు స్వయంగా చదువుకునే దానికన్న ఏ పండితోత్తములో చదివి అర్థం చెప్తుంటే ఆ ఆనందంలోమునిగి మనం యీ ప్రపంచాన్నే మర్చిపోతాం. దేశంలో శాంతి కలగవలె నంటే భారతంలోవున్న రాజనీతి రహస్యాలను గ్రహిస్తే తప్పక ప్రజలకు సుఖము కలుగుతుంది. గాంధీ మహాత్ముడుకూడా వాటిల్లోని కొన్ని ధర్మాలను మనకు బోధించారు.”

“సరేకాని అక్కయ్యా! ఆ వేదవ్యాసమహర్షి యీ గ్రంథాన్ని ఎంతకాలం రచించారో!”

“లోకమునకు మహోపకారం గావించు తలంపుతో హిమాలయపర్వత ప్రాంతంలో శుచియై నియమముతో మూడు సంవత్సరములు రచించారు. దీనిని గురించిన ఒక విషయం చెప్తా విను. నారాయణ స్వరూపుడైన వ్యాసమహర్షి మహాభారతాన్ని రచించాలని సంకల్పించగానే దీనిని సరిగా తప్పులు లేకుండా విసుగుజెందకుండా వ్రాయగలిగినవారు ఎవరా అని ఆలోచించారు. అప్పుడు ఆయన మనస్సుకు విఘ్నేశ్వరుడు తగిన లేఖకుడని తోచింది. వెంటనే గణపతినిపిలిచి తనకు లేఖకునిగా వుండమని చెప్పారు.

గణపతి ఆలోచించాడు. రాసేసామర్థ్యం వుందిగాని యిదంతా ఒప్పుకుంటే ఎన్నాళ్లు పట్టుతుందో. కావ్యం ముగిస్తేగాని ఎటువెళ్లడానికి వీలుండదు. వ్రాయను అని చెప్పడమెట్లా! వేదవ్యాసులకు ఎదురుచెప్పడమంటే సామాన్యమా! ఆలోచించి నెమ్మదిగా ఇట్లా చెప్పాడు ‘మీరు చెప్పిన విధంగా నేను కావ్యాన్ని వ్రాసిపెట్టుతాను. అయితే నా కోరిక ఒక్కటి మీరు తీర్చాలి. నేను గంటము చేతబట్టి వ్రాయుటకు మొదలుపెట్టిన తర్వాత ఒక వాక్యము తర్వాత యింకొకటి చెప్పుతూ వుండవలెనుగాని మీరు మధ్యలో ఆలోచించుతూవుంటే ఆ కాలాన్ని నేను వ్యర్థంగా గడపలేను. కాబట్టి అనుగ్రహించవలసింది అని కోరాడు. వ్యాసమహర్షి ఆయనకంటే గడుసువాడు. అయనేమన్నా రంటే అట్లాగే చెప్పుతానుకాని నేను చెప్పిన శ్లోకాలకు ఒక్క వాక్యమైనా అర్థం తెలుసుకోకుండా వ్రాశావంటే నీ ప్రాణం మీదికి వస్తుంది. జాగ్రత్తగా ప్రతిముక్క అర్థం తెలుసుకొని వ్రాయమన్నారట. విఘ్నేశ్వరుడు గొప్ప విద్వాంసుడగుటచేత వ్యాసుడు చెప్తున్నదల్లా అర్థంతెలుసుకొని వ్రాస్తున్నారు. వ్యాసులకు ఒక్క క్షణమైనా ఆలోచించుటకు వ్యవధి చిక్కలేదు. అందువల్ల ఏంజేసారో తెలుసా! మధ్యమధ్య కొన్ని ముడిశ్లోకాలు రచించేవారు. ముడిశ్లోకమంటే కఠిన పదాలతో ఎంత గొప్ప విద్వాంసులైనా బాగా ఆలోచించనిదే అర్థంగాకుండా వుండేటటువంటివి. ఆ ముడిశ్లోకాలను గణపతి దీర్ఘంగా ఆలోచించి అర్థం తెలుసుకొని వ్రాసేలోపుగా తిరిగి కొన్ని శ్లోకాలను భావనలోనికి తెచ్చుకొనే వారట వేదవ్యాసులు. యిట్లాంటి ముడిశ్లోకాలు మహాభారత మంతటికీ ఆరువేల ఆరువందలు వున్నాయని పెద్దలు చెప్పుతారు.

“బాగుంది అక్కయ్యా! యింకా నీవు చదువుతుంటే తెలుగు కావ్యాన్ని రచించిన మహనీయులను గురించి నీకు తెలిసినది చెప్తే ఉత్సాహంగా వింటాను.”

తప్పకుండా చెప్తాను ! భారతం ఆంధ్రభాషలోనికి మార్చినవారు ముగ్గురని చెప్పానుగాదూ ! వీరినే కవిత్రయం అంటారు. వారిలో నన్నయ్యభట్టు మొదటివారు. యీయన రాజమహేంద్ర వరమునకు రాజగు రాజరాజ నరేంద్రుని ఆస్థాన కవీశ్వరులు. యీ మహానుభావుడు సంస్కృత ఆంధ్రములందు సమాన పాండిత్యముగలవాడు. గొప్ప వేదాధ్యాయనపరుడు. రాజగు రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహమున వీరు భారతమును ఆంధ్రభాషలోనికి మార్చుటకు పూనుకొనిరి. మొదటి రెండున్నర పర్వములు వీరి రచనమే."

"యింక రెండవ వారెవరు?"

"తిక్కన సోమయాజి. ఈయన నెల్లూరు పరిపాలకుడైన మనుమసిద్ధిరాజుయొక్క ఆస్థానమునందు కవిగా, మంత్రిగా నుండిరి. వీరు మహాభారతములో విరాటపర్వము మొదలుకొని పదిహేను పర్వములు రచించిరి. తిక్కన సోమయాజికి కవిబ్రహ్మయనియు, ఉభయకవి మిత్రుడనియు బిరుదములుగలవు. వీని కవిత్వము లోకోత్తరము భారతం రచించడానికి ముందు నిర్వచనోత్తర రామాయణమను గ్రంథం రచించి మనుమసిద్ధి భూపాలున కంకిత మిచ్చెను ఇవిగాక కృష్ణశతకము, విజయసేనము, కవివాగ్బంధము మొదలగునవి యీ మహనీయులే రచించారు. వీరియొక్క గొప్పదనాన్ని గూర్చిన ఒక సంగతి చెప్తా విను. తిక్కనసోమయాజిగారు తన కావ్యాన్ని వ్రాయుటకు గురునాథులనే శిష్యుని నియమించుకొన్నారట. వారు గ్రంథాన్ని రచించుటకు ముందుగా ఒక ప్రతిజ్ఞ జేసుకొన్నారు. ఏ పర్వంలోగాని ఛందస్సు, వ్యాకరణము మొదలగునవి తప్పులుపడ్డా లేక ఒక వాక్యము తర్వాత యింకొక వాక్యము పద్యపాదమునకు సరియగునట్లు కుదురకపోయినా, వ్యాసుల కావ్యానికి సరియగు అర్థం తోచకపోయినా కత్తితో తలను నరుకుకొని ప్రాణత్యాగం జేస్తానని కఠినమైన ప్రతిజ్ఞ బట్టారు. సరే. భారతం నిరాటంకంగా సాగిపోతున్నది. కొంత భాగం అయ్యాక ఒక పద్యానికి సరియైన నడక కుదురలేదు. ఏ వాక్యం ఆలోచించినా సరిపోలేదు. వెంటనే వారు లేఖకు నుద్దేశించి "ఏమి జెప్పుదున్గురునాథా!" అని పలికి కత్తిని ఎత్తబోయారట. వెంటనే శిష్యుడైన గురునాథు డడ్డుపడి ఆపివేసి అయ్యా ! దివ్య వాక్సంపన్నులగు మీ నోట యసత్యము వెలువడదు. మీ రిప్పుడు పలికిన వాక్యంతో పద్యం పూర్తయింది. ఏమిజెప్పుదున్గురునాథా ! యనుపలుకు గౌరవరాజునకు సరిపోయింది అని జెప్పి వారిని తృప్తిపరచారట.

"ధన్యజీవులక్కయ్యా ! వీరిని గురించి ఎంతవిన్నా యింకా వినవలెననే వుంటుంది. యింక మూడవ వారిని గురించికూడా చెప్పు."

"కవిత్రయములో మూడవ వారగు ఎఱ్ఱాప్రగ్గడ కొండవీటిని పరిపాలించిన మొదటి వేమారెడ్డి యాస్థాన కవీశ్వరులు. ఎఱ్ఱన్నకు ప్రబంధ పరమేశ్వరుడనియు, శంభుదాసుడనియు బిరుదములుగలవు. నిరంతరము శివపూజలో నిమగ్నుడయి యుండెడివాడు. వీరు అరణ్యపర్వములో సగము మాత్రమే రచించిరి కాని నన్నయభట్టు, తిక్కనసోమయాజిగార్ల రచనలలో గుర్తింపలేనంత చక్కగా సగము పర్వమును కలిసిపోవునట్లు సామర్థ్యముతో రచించిరి. యిట్లే మహాకావ్యము సుమారు మూడువందల సంవత్సరములకు యీ కవిత్రయముచే పరిపూర్ణముగా పూర్తిజేయబడి లోకంలో ప్రసిద్ధికెక్కింది. ఈ గ్రంథంలోని కొన్ని కథలను అవకాశం కలిగినప్పుడు నీకు చెప్పతుంటాను."

"చాలా సంతోషముయింది యివాళ యీ సంగతులు తెలుసుకోనడం. ప్రతి శలవురోజున నీ దగ్గరకు వస్తాను నీవు చదివి నాకు అర్థం జెప్పు అక్కయ్యా!"

———:o:———

# సంక్రాంతి అల్లుడు

శ్రీమతి గుండాబత్తుల లక్ష్మీబాయిగారు

వెల్లవేసిన గోడల వెలుగుతోడ
పసుపుబూసిన గడపల ప్రభలతోడ
బంతి చేమంతి తోరణ పంక్తితోడ
వింత ముగ్గులతోడ సంక్రాంతి వచ్చె.

పిండివంటల ఘుమఘుమల్ పెచ్చు పెరిగె
పడుచువారల వాహ్యాళి దుడుకు హెచ్చె
క్రొత్త బట్టల తళతళల్ తత్తరించె
అత్త మామల ఒడుదుడు కతిశయించె.

బంతి ప్రసూన తోరణ విభాసిత ద్వారపు వాకిలందు అ-
త్యంతము ముద్దుచెల్లి ప్రమదంబున దిద్దిన ముగ్గులందు సం
క్రాంతికి వచ్చి, నిల్చె గృహలక్ష్మి యదే తన భర్తతోడ సూ;
కాంతకు పుట్టినిల్లు కల కాలము గోరెడి సంచితార్థమా.

మఱదలి వెక్కిరింపు చనుమానము, బావల హేళనంబు, ఘ
ట్టరికపు గౌరవంబు, సహధర్మిణి వాల్గను వాడిచూపు సం
బరము ఘటింప నన్నిటికి ప్రౌఢముగా బదులిచ్చు కూర్మి అ
ల్లురగని అత్తమామలు పరోక్షమువం గను సంతసింపరే!

రూపుదాల్చిన క్రొత్త యల్లుండ్రతోడ
పతుల సేవల మెప్పించు సతులతోడ
అత్త మామలతోడ వియ్యాలతోడ
వరలు సంక్రాంతి గృహమదే స్వర్గసీమ.

పిల్ల నొసంగినట్టి శుభవేళ మొదల్కొని తల్లి తండ్రు లా
యల్లుని నెత్తిబెట్టికొని యాదరముల్ నిజ సంతుకన్న సం
ఫుల్ల ప్రమోదమున్ బరపి ముచ్చటజూతురు ; వారి పాలిటన్
అల్లురు కొంతమంది నిజ మద్భుత భూతములట్లు దోచెడిన్.

అత్తవారిల్లు బావి; అర్ధాంగి చేద;
పండుగలు త్రాడు; అల్లుడు బావికాపు;
తోడ జూచును సంక్రాంతి తొలియటంచు
అంత సంవత్సరాది దీపావళి వచ్చు.

ప్రేమ దలిర్ప సర్వ మొనరించినగాని దయావిహీనుడై
మామను పిండి పీల్చి దశమ గ్రహమట్టులు బాధపెట్టు నా
సోమరి అల్లుడా? తలది చూచిన యాతడు మానవాత్ముడే
మామకు అత్తకున్ ముదము మన్నన గూర్చెడివాడె అల్లుడౌ!

తాహతకు మించి కలు తగాదాలు పెంచి
అత్త మామల నేడ్పించు అల్లువారు
పరువు నశియించి వీధిని బడుట జరుగు
తుదకు మిగిలెడి దల్ల నిష్ఠూర మొకటె!

అల్లుడా క్రొత్త సంక్రాంతి యరుగుదెంచె
గృహిణితో గూడి అత్త వారింటి కేగి
వారి మర్యాద నీ గౌరవంబు నిలిపి
"మంచివాడవు నీ" వనిపించుకొనుము.



## సంక్రాంతి అభినందన

సంక్రాంతికి స్వాగతం సుస్వాగతం!
సంయుక్త సమ్మిళిత
స్వధర్మ స్వజాతి
సోపాన మార్గానస్వాగతం సుస్వాగతం!

సంక్రాంతి కాదోయ్
స్వదేశ క్రాంతి
స్వమాత కాంతి
స్వరాజ్య పథాన్న స్వాగతం!
సుస్వాగతం!!

సంక్రాంతి సందేశం
స్వమాత పూజ
స్వదేశ ప్రేమ
ప్రేమ—
మృత్యువుకు వెరవని ప్రేమ
కన్నీటి కాల్వలో
కష్టాల తెప్పలో
తేలి వెళ్లే ప్రేమ
స్వరాజ్యాన్ని సాధించవోయ్!
సంక్రాంతినీ మ్రోగించవోయ్!!

కాంచం వెంకటరత్నమ్మ.

# నెల్లూరి శ్రీ రంగనాయకుల దేవాలయము

నేడు నెల్లూరు అని పిలువబడునది పూర్వము వీరవిక్రమసింహపురి అని పేరు పొందినది. ఇక్కడనే భారతము 15 పర్వములను తెనిగించిన కవితిక్కనయు, రణరంగ విహారమున పేరుగాంచిన శూరుడగు రణతిక్కనయు జన్మించిరి, కావున ఈ నగరము పురాతనకాలమందు చాల పేరు ప్రఖ్యాతులు కలిగినది.

ఈ యూరినంటి ఉత్తరమున ఉత్తరపెన్న పారుచున్నది. ఆ నది రైలువంతెనకు సమీపించేచోట ఐమూలగా తిరుగును. ఆ తిరుగుడు కనిలోనే ఈ శ్రీ రంగనాయకుల దేవాలయమున్నది. అందుచేతనే "పెన్నదాటితే పెరుమాళ్లసేవ" అనే సామెత ఏర్పడినది.

దీనినే ద్రావిడమున "పళ్లికొండ" రంగనాయకుల దేవాలయమనియు, సంస్కృతమున తల్పగిరి శ్రీ రంగనాయకుల దేవాలయము అనియు, చెప్పచుందురు. ద్రావిడమున "పళ్లికొండ" అనగా "పడుకొన్న" అని అర్థము. అందుకనుగుణ్యముగా ఇక్కడ స్వామిపడుకొని యున్నట్లున్నాడు. బహుశా ఈ "కొండ" శబ్దమును పర్వతమున కన్వయించుకొని — సంస్కృతీకరింపగా "తల్పగిరి" యైనట్లున్నది. మరియు నిందులకు అనుగుణ్యముగా ఇక్కడికి సమీపస్థమగు నరసింహస్వామి, జొన్నవాడ కామాక్షి దేవాలయములును కొండప్రదేశములందున్నవి. ఈ రంగనాయకుల దేవాలయమును రాతిచట్టుపై నున్నది. ఆగమశాస్త్రములందు మూలవిగ్రహములు మూడువిధములు అని చెప్పబడినది. కొన్ని నిలచి యుండును: శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు, తిరువల్లిక్కేణి పార్థసారథి విగ్రహములవలె; కొన్ని కూర్చున్నట్లుండును: శ్రీ పట్టాభిరామమూర్తి. కొన్ని పరున్నట్లుండును: శ్రీ రంగనాయకులు, అనంత పద్మనాభస్వామిని, తిరుపతి గోవిందరాజస్వామి. ఇక్కడనున్న చోళులనాటి తమిళ శాసనములలోను "శయ్యప్పెరుమాళ్." అనియు, "పళ్లికొండనాధర్" అనియు నున్నదట. ఈ పరున్న విగ్రహమున కాగమశాస్త్ర వివరణమున్నను ప్రజాసామాన్యము తమ కట్టుకథల నల్లకమానలేదు. శ్రీ వేంకటేశ్వరస్వామి (తిరుపతి) ఈయనకు తమ్ముడట. ఆ తమ్ముని పెళ్లికి ఈయన ధనము కొలిచి, కొలిచి, విసిగి అలిసి, ఆ కొలపాత్రనే తలక్రిందపెట్టుకొని పడుకొని, అలసట తీర్చుకొనుచున్నాడని వారందురు.

ఈ దేవాలయము నెల్లూరున రైలుస్టేషనుకు సమీపములో గ్రాండుట్రంకురోడ్డు మీదనున్నది. దీని ముందుండు గాలిగోపురము సుమారు 100 అడుగుల యెత్తున, వెడల్పు, వైశాల్యము గలదై యున్నది. ఇందు అందమయిన చిత్రములు చెక్కబడినవి. ఇది ఏడు అంతస్తులు గలిగి తూర్పు మొగముగా నిలబడి యున్నది. దానికి ముందున్న మూడువీధులు కలయుచోట నాలుగుకాళ్ళ మండపము ఉన్నది. గోపురద్వారము కాక, దానికి ఉత్తరముగాను దక్షిణముగాను, దేవాలయ ప్రవేశమునకు ప్రాకార మహాద్వారమువఱకు - బోడి గోపురము అనంబడుదానివఱకు - వ్యాపించి, దేవళముని చిన్నవీధులు, ఇటు మూడు అటు మూడు ఇండ్లుగలవి ఉన్నవి. ఆ గోపురమును ఆ వీధులును ఆ ప్రాకారమును చుట్టురా, విశాలమైన ముంగిలి, దేవుడు బయటికి ఉత్సవమునకు వేంచేసి మరలునపుడు తొక్కడము, శాత్తుమొరలు (పారాయణ అరంభావసాన విధులు) జరుగుచోటు ఉన్నది. దాని నడుమను ఒక నాలుగుకాళ్ళ మండపము కుంభహారతి మండపము అనబడునవి ఉన్నవి.గోపురద్వారముగుండ గోపురమును దాటి, ఆ కుంభహారతి మండపమునుదాటి, ప్రాకార మహాద్వారమును చేరగానె దేవళములోపల ప్రవేశము కలుగును. అచట ఎట్టయెదుట పెరుమాళ్ళగుడి పృష్ఠము అగపడును. ఆ గుడికి మొగము పడమటిది. దానికి యెదురుగా పడమట ధ్వజస్థంభము ఉన్నది. విశేషము, విపరీతము ఏమనగా, గోపురము

తూర్పు మొగమై ఊరును చూచును, దేవుడు పడమటి మొగమై పెన్నను చూచును. అట్లు దేవళములోపల చొరగానే కుడివైపున తూర్పు ప్రాకారమున పడమటి మొగముగా దేవళము కచ్చేరియగు ధర్మ విచారణాధికారులుండు గదియు, యాగశాలయు కలవు. అట్లే యెడమవైపున దేవళము వంటయిల్లు (మటపులి-యనబడునది) ఉన్నది. (కచ్చేరిగది మిద్దెమీద దేవుని ఆభరణ భండారము ఉన్నది) ఉత్తర ప్రాకారమున ఈశాన్యమూలలో దక్షిణమొగముగా శఠకోప పరకాలాదులు ఆళ్వారులు, రమ్యజామాత్రాదులు ఆచార్యులు వేంచేసియుండు సన్నిధి, విశాలమైన మండపముతో కూడుకొన్నది కలదు. ప్రాకారము లోపల ప్రదక్షిణము ఆరంభించి, దక్షిణముగా 50 గజములు సాగినంతట, వీధి పడమటికి తిరుగును. ఆ యాగ్నేయమూలలో వంటయింటికి యెదుట ఒక నాలుగుకాళ్ళ మండపము, ఉత్సవములలో రంగనాయకికి ఉయ్యాల, కుంభహారతి జరుగుచోటు కలదు. దానికి ఎదురుగా పడమట ఎట్టెదుట అమ్మవారి (రంగనాయకి) గుడి, ఎడమవైపు ప్రాకారమును ఆనుకొని పెద్ద మండపము, అలంకార మండపము అనునది, తిరుణాళ్ళ - మొదలగు పెద్ద యుత్సవములలో పెరుమాళ్ళకు అలంకారము సమర్పించుచోటు, కలదు. అమ్మవారు తూర్పు మొగముగా ఎదుట ఇంచుక యెడమవైపుననున్న - గుడిలోని రంగనాథుని ఓరచూపులు చూచుచున్నట్లు కూర్చుండియుండును. అలంకార మండపమునకు ఆనుకొని అమ్మవారిగుడికి దానికిమధ్య 'అద్దాల మండపము' అనునది, లోపల - గోడ - గుంజ - కప్పు, తలుపు - అలమైరా - సర్వమును నిలువుటద్దములతో అమర్పబడినది కలదు అమ్మవారికి ఉత్తర ముఖముగా ఎడమవైపున దేవళము, పెద్దగంట, మండపము కలదు, దానికి ఉత్తరమున ధ్వజస్తంభ మహాబలిపీఠములున్నవి. అచటి ప్రాకారమున పడమటి మొగముగా ఒకగోపురము ఏటిదేవళము రేవుకు దింపునది కలదు. ఆ ద్వారముగుండ వెళ్ళిన పెన్న 'ఉత్తర వాహిని' మంచిరేవు, ప్రక్కన అరుగు, తులసికోట, మండపము మొదలగునవి కనువిందు సేయును, ఆ ద్వారము దాటగా యుత్తరము పడమర యుత్తరములు కలయు మూలలో ఆండాళు (=గోదాదేవి) గుడి తూర్పుమొగమైనది, ఇటు రంగనాయకీదేవిగుడికి అటు జతగా ఒప్పునది కలదు. అందు గోదాదేవియు ఎదుట ఇంచుక కుడివైపుననున్న గుడిలోని రంగనాథుని ఓరచూపులు చూచుచుంబోలె నిలబడియున్నది. దానిముందు నూరుగాళ్ళ మండపము చాల విశాలమైనది కలదు అటనుండి తూర్పునకు నడచిన దేవుని వాహనములన్నియు పదిలపరచుగదియు దానిని దాటగనే మరల ఆ యాళ్వారుల సన్నిధియు వచ్చును.

ఈ ఆవరణము నడుమనుండు విశాలమైన గుడి రంగనాయకులది, పడమటి మొగమైన గర్భగృహమున వేంచేసియుండు రంగనాయకుల మూలవిగ్రహము, పవ్వళించి (=పళ్ళికొండు) శ్రీ భూదేవులచే పాదసేవ పొందుచున్నట్లుండును. ఉత్సవ విగ్రహము ఇరుపార్శ్వముల శ్రీభూదేవులతో కూడి నిలంబడియుండును. వీనిలో పెరుమాళ్లగుడి, అమ్మవారిగుడి, ఆండాళ్లుగుడి, దానిముందున్న నూరుకాళ్లమండపము, ఇవి ప్రాచీనమైనవి. 1000 సం||లనాటి వనవచ్చును. మిగతవి వందల సం||లనాటివే. అద్దాల మంటపము మాత్రము ఇటీవల ఏర్పడినది.

ఈ దేవాలయమునకు ముందుండు గాలిగోపురము చాలగంభీరమైనది. పెన్నవంతెనపై రైలు నడుచునప్పుడు చూడనగును. దీనిని క్రీ. శ 1850 ప్రాంతమున శ్రీ యరగుడిపాటి వెంకటచలం పంతులుగారు కట్టించిరి. ఈ వెంకటచలంపంతులుగారు డాక్టరు కేసరిగారు తమ చిన్ననాటి ముచ్చట్లలో నెల్లూరి ఆంధ్ర భాషాభిమాన సమాజమునందు సుల్తాన్ పాత్ర వేయువారని చెప్పిన వెంకటచలంపంతులుగారి తాతగారు. పేరు జతకూర్చకే ఊరక 'పంతులు' అన్న అన్వయమగుట ఈ గాలిగోపురము కట్టిన పంతులుతో ప్రారంభమై మనుమలైన పంతులుగారివరకు సాగినది. వెండితెరపై పేర్గాంచిన శ్రీ వై. వి. రావు (యరగుడిపాటి వరదరావుగారు) ఈ తాత వెంకటచలం పంతులుగారి మునిమనుమలు. తమ తాతగారిపేరటవారు,

శ్రీ పంతులుగారు ఆ రోజులలో జిల్లాకోర్టు సిరస్తాదారు ఉద్యోగముచేయుచుండి తమ సంపాదనలోనుండి ఈ గోపురమును కట్టించి తమపేరు శాశ్వతమొనర్చుకొనిరి. ఈ గోపురం ఉన్నతమును గంభీరమునేగాక మంచి చెక్కడములతో నలరారుచున్నది.

ఈ గోపురం ఏడవ అంతస్థునుండి చూచినచో సుమారు 15 మైళ్ల దూరంలోనున్న సముద్రము కాననగును. ఈ గోపురము కట్టుట 15 సం॥లు పట్టినదట. దీనిపైనున్న 7 శిఖరములలో మధ్యదిమాత్రము విత్తళిదిగాని మిగత నటునిటునున్న 6 న్నూ బంగారపు నీరుపోసినవి ఈ గోపురమధ్యమున ఉయ్యాల కట్టుటకు నేర్పాటున్నది. పంతులుగారు సం॥న కొక్కసారి రంగని కిక్కడ ఉయ్యాలసేవ చేయించేవారట.

గోపురము కట్టుపని పూర్తియై పూతపని కానుండగ విజయనగరం మహారాజులుంగారు శ్రీ శ్రీ శ్రీ విజయరామ గజపతిరాజులుంగారు రామేశ్వరయాత్రపై వెడలి నెల్లూరుజేరి ఈ గాలిగోపుర నిర్మాణమునకై యచ్చెరువొంది నిర్మాత పంతులవారని తెలిసికొని అనాహూతులయి వారి యింటికి విజయముచేసి పంతుల వారిని విశేషముగ నభినందించి అపూట వారియింట విందునైరి. పంతులవారి దేవతార్చనలో కర్పూరహారతి సమయమున శ్రీవారొక బంగారుమొహిరీని సువర్ణ మంత్రపుష్పముగ సమర్పించిరి. అయ్యది ఇప్పటికి వారి దేవతార్చనలో శ్రీ తాండవకృష్ణ కంఠహార-పతకమై ప్రకాశించుచున్నది.

ఆళ్వారు సన్నిధి మంటపమునను అద్దాల మండపము లోతట్టును రంగుల చిత్రములున్నవి. గోపురమునకు దక్షిణమున నూరుగజముల దూరములో గంగన్న మండపమున్నది. ఉత్సవములలో దాని యందు స్వామివారు వేంచేయుదురు. దానిని రంగనాయకులపేట వైష్ణవమహత్తరులు శ్రీ కందాడైవారు కట్టించిరట. ఈ కందాడైవంశంబునకు చెందినవారే, వేదము వారి శాకుంతలమున దుష్యంత పాత్రధారి శ్రీనివాసన్ (దొరస్వామి)గారు. వారి యిల్లు ప్రాకారములోనే గోపురముదాటిన పిదప లోద్వారపు ఎడమతట్టు ఆనుకొనియున్నది. వీరి కుటుంబమునకు శ్రీరంగనాయకుల పవ్వళింపుసేవ సాయించు ఆచారమట. శ్రీనివాసన్‌గారును వీలున్నపుడెల్ల 'ఆ పవ్వళింపు సేవకీర్తనల పాడుచుండే వారట. ఆ అలవాటున కాబోలు శ్రీనివాసన్‌గారు నాటక రంగస్థలమున పద్యములు చదువునప్పుడున్నూ ఉయ్యేల ఊచినట్లే చల్లగనుండెడిది. శ్రీ భూదేవులతోకూడి స్వామి ఉయ్యేల నూగుచున్నపటము వేరొకచో ముద్రించితిమి. శ్రీ రంగనాయకులకొక పెద్ద రథము నొక పుష్ప (చిన్న) రథముకలవు. పెద్ద రథమున చుట్టిరా నలంకారముగ నెన్నో కొయ్య చెక్కడపు బొమ్మలు అమర్పబడియున్నవి ఆ రథము నకు సమీపంలోనే చిత్రకూటము అని మరొక స్థళమున్నది. దానినిన్నీ గోపురముకట్టించిన శ్రీ వెంకట చలం పంతులుగారే దానికన్నా చాల సం॥ములకు ముందు కట్టించియున్నారు. ఆ కట్టడములోను గోడలకు రంగు చిత్రములు చిత్రింపబడియున్నవి. అందుచేతనే దానికాపేరు. అవి 100 సం॥ల మీదటివైనను, మాయక అందముగానున్నవి. ఇచ్చట వేసవిలో శ్రీ రంగనాధునికి పదిరోజుల తిరునాళ్లయు జరుగునట.

అసలు తిరునాళ్ల మాఖమాసమునందు జరుగుచుండును. మాఘశు పౌర్ణమిరోజున గరుడోత్సవము. ఆ పున్నమి రాత్రియందు వైష్ణవాంగనలు చక్కగా నలంకరించుకొని, సోయగమిూర రోడ్డుపై నిండార పలువిధముల ముగ్గులు పెట్టుదురు. అప్పటికి వ్యవసాయపుపనులై, రెడ్లు మున్నగు రైతులు, ధాన్యముకూడనూర్చి ఇంటికి చేర్చుకొందురు. ఆ సంబరముతో, పల్లెటూరి పడుచులు బంతి చామంతులను ఒత్తుగా ముడిచిన జడచుట్టలతో, మంచి నగలు చీరలు సింగారించుకొని, తాంబూలముల ఘూర్ణించుచు ఇసుకవేసిన రాలకుండ శ్రీ రంగనాధుని సేవింపవత్తురు. శ్రీ రంగనాధస్వామి అర్ధరాత్రమునకు కొద్దిగ ముందు, బంగారపు గరుడవాహనా రూఢుడై ద్వారదర్శన మొసంగి భక్తులను తన్మయుల నొనర్చును. ఆ ఉత్సవమెంతో రమణీయముగ నుండును.

శ్రీ రంగనాథస్వామికి శేష, హంస, సింహ, చంద్రప్రభా, సూర్యప్రభా, పున్నాగవృక్ష, హనుమద్, గరుడ, పుణ్యకోటి విమాన, భద్రగజ, మహారథ ధవళాశ్వ, పుష్పరథ, బహువిధ శిబికా, దమన, వివాహాదులైన వాహనము లన్నియు కలవు. ఆభరణములున్నూ 50 వేల విలువకు మించినవే కలవన వచ్చును. వజ్రముడి యొక్క టే 11 వేలట; అదియు పూర్వము. వీనిని ముప్పిరాల పెద్ద నరసింహాచార్యులు చిన్న నరసింహాచార్యులుగార్లు సమకూర్చిరి.

ఉత్తరపినాకినీ మహాత్మ్యము బ్రహ్మాండ పురాణములోనున్నది చాలపావనమైన నదియని అందు చెప్పబడినది. క్షేత్రమహాత్మ్యము స్కాంద పురాణములోనున్నది. శ్రీ విష్ణుభగవానుడు ఆదిశేషుని తూర్పు సముద్ర తీరమున తనకై క్రీడాశైలముగా నమరుమనగా ఆతడట్లాయెనట. ఆ విష్ణుమూర్తి రమాదేవీసమేతుడై వచ్చి కొన్నాళ్లట క్రీడించి వెడలిపోయెను. శ్రీ విష్ణుమూర్తి స్పర్శప్రభావమున నా కొండ ఆకాశమంట పెరుగ నారంభించెనట. అప్పుడు బ్రహ్మాదులచే ప్రార్థితుడై శ్రీ విష్ణువు గరుడ వాహనారూఢుడై వచ్చి యా ఫణీంద్ర పర్వతమును అణగద్రొక్కెనట. అయితే ఆ పర్వతరాజమునకు మూలమైన ఆదిశేషుడు శ్రీ విష్ణుమూర్తి ననేక విధముల స్తోత్రముచేయగా ప్రసన్నుడైన స్వామిని తన యందు శాశ్వతముగా వారు నివాస మేర్పరచుకోవలయునని వరమడిగెను. అప్పుడా దేవుడు కొన్నాళ్లకు కాశ్యపుడువచ్చి తపమొనర్చి నన్ను ఇదే వరమడిగి పొందును, అప్పటినుండి ఇక్కడ నేనట్లే యుందునుఅని అయన శలవిచ్చిరట. అట్లే కొంత కాలానికి కాశ్యపుడు మహేంద్రగిరివద్ద వేలఏండ్లు తపమొనర్చియు భగవంతుని ప్రసన్నుని చేసుకోజాలక చింతించుచుండ-నారదుడువచ్చి "ఫణిరాజగిరికిపొమ్ము, క్షేత్రమహాత్మ్యమున నీ కిష్టసిద్ధియగు"నని చెప్పెను. అట్లే ఇచ్చటికివచ్చి పౌండరీక యజ్ఞమొనర్చి ఇష్టసిద్ధి వడసెను. ఆ నాటి వెలిసిన శ్రీ విష్ణుమూర్తి ఇచ్చట నిత్యనివాసము నేర్పరచుకొన్నాడు.

ఇవన్నియు పౌరాణికగాథలు. చారిత్రిక నిరూపణములు చూడగా నీ 'ఫణిగిరీంద్రము'నకు గాని, 'తల్పగిరి'కి కాని చరిత్రాధారములు కానరావు, దీని ఆయువు వేయేండ్లు అని శిలాశాసనముల అధికారమున చెప్పవచ్చును. 1197 లో చోడప్రభునివల్ల భూదానము నీదేవుడు పొందెను. ఇట్లే కులోత్తుంగ చోళదేవ, రాజగండగోపాలదేవ, సుందరపాండ్యదేవ, రంగరాయదేవాది రాజన్యులు శిలాశాసనములందు 16 వ శతాబ్దమువరకు గలవారలు కన్పించుచున్నారు. ఆ పిదప 17 వ శతాబ్దిలో తురకలరాజ్య మేర్పడినది. అప్పు డీ క్షేత్రము పాడుబడి విగ్రహములున్ను అపహృతములైనట్లు వినుదుము. కంపెనీ ప్రభుత్వమేర్పడి తురకల ఉద్ధృతము తగ్గిన పిదప, నీ దేవుడు మరల ఉదయగిరి నవాబుల వద్దనుండి కంచేవారను బలిజకులస్థులు నిద్రాభోజనములుమాని యొక్క ప్రయాణమున తలపై మోసికొనిరాగా ఇక్కడికి చేరినారట! అప్పుడు పురాణ ప్రసిద్ధనామములన్నియు హరించి, శాసనబద్ధమైయున్న 'పల్లికొండ పెరుమాళ్లు' 'పండుకొన్న శ్రీ రంగనాథస్వామి'గా మారినారు. ఆ నాడు స్వామిదేవాలయ జీర్ణోద్ధారణ మొనర్చినవారు శ్రీ హుగ్గిళ్ల వెంకాజీపంతులుగారు.

ఈ దేవాలయమునకు అనాదిగా తీర్థమర్యాదగలవారు వింజమూరివారు, నేలటూరివారు అను నెల్లూరి వైష్ణవులు. జీర్ణోద్ధారణమైనప్పుడు (1770) లో వీరే మొదట యాజమాన్యమున నమర్పబడిరి. ఆ పిదప (1772) వెంకాజీపంతులు తమకాచార్యులగు భావనాచార్యులు వారిని తిరుపతినుండి పిలిపింపగా వారు ప్రథమతీర్థార్హులుగను, క్రమముగా వింజమూరివారు, నేలటూరివారు ద్వితీయతృతీయ తీర్థార్హులుగను, అయిరి. - ఆ వరుసనే ధర్మకర్తృత్వము అప్పచెప్పబడినది. అది మొదలు 1919 సం॥ వరకును వీరే ధర్మకర్తలుగ నుండిరి. 1920 లో స్కీము ఏర్పడి ట్రస్టీలు నియమింపబడిరి. 1930-31 లో హిందూ



నెల్లూరి శ్రీరంగనాయకుల ఏడంతస్థుల
గాలిగోపురము.



శ్రీ రంగనాథస్వామివారు రంగనాయకీ సమేతులై
ఉయ్యాల నూగుచున్నారు.

౯౪౮ సం॥ సెప్టెంబరు సంచిక యందు శ్రీ కేసరిగారు "నాచిన్ననాటి ముచ్చట్లు" లో ప్రస్తావించిన
నటశేఖరులగు శ్రీ కందాడై శ్రీనివాసర్‌గారి (దొరసామి) వేషధారణము.







శ్రీనివాసకళ్యాణ నాటకమున

శ్రీ ని వా సు డు గా

పద్మావతికి ఎరుకచెప్పవచ్చిన
ఎరుకతగా (శ్రీనివాసదేవుడే ఆవేషమువేసెనట)

దేవాదాయములబోర్డు అధీనమై వారేర్పరచిన ట్రస్టీలు పరిపాలించిరి. ఇప్పుడు వారి యగ్జిక్యూటివ్ ఆఫీసరు పరిపాలన క్రిందికది వచ్చినది.

శ్రీ రంగనాథస్వామివారికి రంగ రంగ వైభోగముగా నైవేద్యాది కైంకర్యభోగములు ప్రతినిత్యము సాగుచుండును. ప్రాతఃకాలమునుండి క్రమముగా మేలుకొలుపు, ప్రథమారాధన, ఆరగింపు (విశేషదినాలలో తిరువంజనము) రెండవ యారగింపు, సాయంకాలము తోమాలెసేవ, తిరువారాధన, మూడవయారగింపు శయనము జరుగును.

తొలియారగింపునకును, మూడవయారగింపునకును 7 సి సేర్ల 'అలంకార' ప్రసాదము నివేదింపబడును. రెండవయారగింపునకు మాత్రము 9 సేర్ల 'అలంకార' ప్రసాదము నివేదింపబడుచున్నది

(ఈ ప్రసాదమునకు వినియోగమయ్యే తళియలపాక విశేషమును, వానిలో చేరువస్తువుల పాళ్లున్నూ వేరుగా పాకకళ యందురచింపబడినది.)

స్వామి ఆరగింపైన అనంతరం తైర్థికులు, అర్చకులు, పరిచారకులు మున్నగు కైంకర్యపరులకు ఇతర పరిజనులకు దీనిని వినియోగపరతురు. ఇట్లు ముప్పొద్దు సుష్ఠుపూర్తిగా భోంచేయు దేవుడు పినాకినీ తీరమున వేంచేసియుండుట చేతనే కాబోలు — ఆ నదీజలము పారు నా ప్రాంతముల రెడ్లు రెండు కారులు మేలురకము ధాన్యమును పండించి ముప్పొద్దు ఆరగించి, అతిథి అభ్యాగతులను తన్పుచుందురు.

ఉత్సవం రోజులలో ఉత్సవమూర్తులకు వివిధమైన సేవావిశేషములున్ను సాగుచుండును.

ఈ ప్రత్యేకోత్సవములలో ముక్కోటి ఏకాదశి, తిరునాళ్లు, వేసవిలో చిత్రకూటమున జరుగు తిరునాళ్లు ముఖ్యమైనవి.

ఈ దేవాలయమునకును చిరకాలము దేవాదాసీలుండిరి. వారు మిరాసీలుకల్గి ఊడిగము, కుంభ హారతి, నృత్యసేవ, గానసేవ జరుపుచుండిరి. వారికి శ్రీ స్వామివారినిగూర్చిన లాలిపాటలు, ఎచ్చరికలు, మేలుకొలుపులు, పాన్పుసేవ పాటలు, ఇత్యాదులు కొన్ని పరంపరగా వచ్చియుండి పాడుచుండేవారట. ఆ దేవదాసీలు, మానవసేవయు ప్రారంభింపగా క్రమముగా, మిరాసీలు, వ్యక్తులుకూడా 50 సం॥ల క్రితమే హరించిపోయినారు. ఆ పాటలును వారితోనే పోయినవి.

ఈ దేవాలయమున తొలుతనుండియు ఆంధ్రదేశమున మిగత అన్ని ప్రదేశములలోవలెనే, వైఖానసాగమము ఇక్కడి సాంప్రదాయము. కావున చాంద్రమానమే ఇక్కడ ఆచారముగ అనుసరింపబడును. తెలుగు సంవత్సరాదియే ఇక్కడ ప్రసిద్ధి ఇక్కడ ప్రతిదినము తిథివార నక్షత్రములను, ఉగాదినాడు విశేషముగా తెలుగు పంచాంగ శ్రవణమును కొల్లూరు వారను తెలుగు పౌరోహితులు గావించుచుండిరట. అయితే కొలది సంవత్సరములుగా క్రమమున ద్రావిడదేశ సాంప్రదాయానుసారము, పాంచరాత్రాగమము ప్రవేశించి కాలు నిలువతొక్కుకొనుచున్నది. అయినను ఇంకను ఉత్సవాదులు, ఉగాది చాంద్రమాన పంచాంగము ననుసరించియే జరుగుచున్నవట. హిందూదేవాదాయములబోర్డు వారీ సంగతి గ్రహించి ప్రాచీనాచారమును నిలుపవలయును. చెన్నపురియందలి శ్రీ పార్థసారథి సన్నిధిలోను చాంద్రమానము; తెలుగు పంచాంగమునే. ఈవిధముగా నెల్లూరియందు వేంచేసియుండి నిత్యవైభోగముల నానందించు శ్రీ రంగనాథస్వామివారు గృహలక్ష్మి పాఠకులకు వారి బంధుమిత్రులకు నిత్యభోగ భాగ్యముల నొసంగుగాక

(ఇందలి సమాచారము కొంత వినికిడి, కొంత చూచినది, కొంత దే. బో వారు ప్రచురించిన చిన్న గ్రంథములోనిది, మరికొంత మామూలుగ బ్రహ్మశ్రీ రాజశ్రీ వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు దయతో సేకరించి పంపినది. గృ॥ సం॥ )

—0—

# "గృహలక్ష్మి" 16, 17 సంపుటముల సమీక్ష



యుద్ధకాలమున తత్కాలముగా విరమింపబడిన మా "గృహలక్ష్మి" ఇల్లు [illegible] కాని తిరిగి 1947 సం॥ జనవరిలో తెలుగు పత్రికా ప్రపంచములోనికి తన పునరాగమనము వెల్లడించినది. నాటినుండి ఆంధ్రదేశములోని స్త్రీ పురుష రచయితలు — యథారీతి తమతమ ఉత్తమ రచనలను మా కంపి - ప్రకటింపుడని వేగిర పెట్టుచునే యున్నారు. మేము వరుసగా నీ రెండు సంచికల ప్రచురించిన ఆయావ్యాస వర్గీకరణము:—

| | 16 వ సం॥ము | 17 సం॥ము |
|---|---|---|
| వ్యాసములు | 135 | 64 |
| కథలు | 20 | 18 |
| నాటికలు | 5 | 4 |
| పద్యరచన | 41 | 40 |
| పాటలు | 22 | 13 |

కొన్ని రచనలు 1948 లో వరుసగా కొన్ని సంచికలలో పడుటచే—ఏకరచనగా లెక్కింపబడినందున - ఆయా వాని సంఖ్య క్లుప్తమైనది కాని పలువిధములగు రచనలు ప్రకటితములు. 1947 లో 15 జీవిత చరిత్రలే; 48 లో 16. రేడియో ప్రసంగములు వరుసగ 6, 7.

ఈ రచనలను పంపిన వారిలో — స్త్రీ రచయితలు 16 వ సం॥కు (1947) 82 మంది. వీరిలో పలువురు 17 వ సం॥కు (1948) కూడా తమ రచనలంపిరి; ఆ ప్రాతవారుగాక క్రొత్తగా రచనలంపినవారు. (17 వ సంచికకు) 64 మంది స్త్రీలు.

పురుషులను ఇట్లే ఏర్పరుపగా: 16 సం॥కు (1947) 76 మంది. 17 సం॥కు (1948) 37 మంది.

16 వ సం॥కు (1947) తమ రచనలంపిన స్త్రీల పేర్లు ఈ క్రింద నిచ్చుచున్నాము:—

శ్రీమతులు చింతలపూడిజగదాంబ, నూరినాగమ్మ, వంగలవాణీబాయి, పాకలరాజామణెమ్మ, కనుపర్తి వరలక్ష్మమ్మ, మైదవోలు పద్మావతమ్మ, అల్లాడిఅన్నపూర్ణమ్మ, గంటి కృష్ణవేణమ్మ, చిల్కపాటి సీతాంబ, అచంట సత్యవతెమ్మ, కె లక్ష్మమ్మ, పసుమంత్రి రాజ్యలక్ష్మిదేవి, సి. జానకి, సోమంచి సూర్యకాంతమ్మ, వల్లభనేని సీతామహలక్ష్మమ్మ. చుండూరి రమాదేవి, కత్రి కనకమ్మ, నాగాభట్ల మాణిక్యాంబ, యం సుశీల, పోలవరపు కాంతమ్మ, అచంట రత్నకుమారి, చదలువాడ నాగరత్నం, తెన్నేటి వసంతమ్మ, మమత కుమారి, అవ్వారిపూర్ణ, రావినూతల అనసూయాదేవి లీల, గాదె లక్ష్మీనరసమ్మ, ఘండికోట సావిత్రి, పద్దూరి మీనాక్షమ్మ, ఆరుషభట్టు నాగభూషణమ్మ, ఇమ్మానేని చంద్రకాంతామణి, వల్లూరుపల్లి వెంకటరత్నమణీబాయి, ముదుంబ వెంకటమ్మ, సామవేదుల చిరంజీవి, కృష్ణాబాయి. అల్లాడి వెంకట లక్ష్మమ్మ, వెల్లంకి అన్నపూర్ణాదేవి, అల్లూరి అన్నపూర్ణాదేవి, బృంద, జయంతి, దీక్షి

కామేశ్వరీదేవి, తాళ్ళూరి సుదర్శనీదేవి, చాకలకొండ కనకవల్లి, అయ్యదేవర బాలా త్రిపురసుందరమ్మ, మన్య కామేశ్వరీదేవి, బోడపాటి అలివేలమ్మ, చెరుకూరు నాగభూషణమ్మ, పొన్నపల్లి అన్నపూర్ణాదేవి, శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీసాహెబా, కొండ పార్వతీదేవి, స్థానాపతి రుక్మిణమ్మ, దువ్వూరి సుబ్బమ్మ, ఎన్. లక్ష్మీదేవి, బాలసరస్వతమ్మ, ముల్పూరి చుక్కమ్మ, బి. కామేశ్వరమ్మ, బత్తుల కామాక్షమ్మ, వేంద్ర లక్ష్మీకాంతమ్మ, కడప రామసుబ్బమ్మ, నడింపల్లి శారదాకుమారి, చిల్కపాటి అమ్మణ్ణి, క సూర్యకాంతమ్మ అయినవల్లి సుభద్రాకుమారి, యం, స్వరాజ్యలక్ష్మీదేవి, బి. సరోజినీదేవి, వి విమలాదేవి, తిమ్మరాజు హైమావతి, పి, సత్యవతెమ్మ, చాటమర్తి చంద్రకాంతమ్మ, సూర్యదేవర శకుంతలాదేవి, పొన్నపల్లి అన్నపూర్ణాదేవి, నాయని కృష్ణకుమారి, మాదిరెడ్డి సుబ్బరామమ్మ, గొర్లె లక్ష్మీబాయమ్మ, యడవల్లి శ్యామలాదేవి, కె. సుందరాబాయి, కోలాహలం వెంకటనరసమ్మ, అల్లూరి హైమవతీదేవి, వి. కామేశ్వరమ్మగార్లు.

వీరు గాక 17 వ సం॥కు (1948) క్రొత్తగా పంపినవారి పేర్లు ఈ క్రింద నిచ్చినాము:—

శ్రీమతులు పప్పుసీతమ్మ, చింతారుణభట్ల పద్మావతీదేవి, సరస్వతి చెన్నకేశవన్, బుర్రా కమలాదేవి, ఆలపాటి సీతారామమ్మ, భూషి అన్నపూర్ణాదేవి, యెర్నేని శేషమాంబ, దేశిరాజు భారతీదేవి, పాణకా కనకమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, నెమలి చంద్రమతీదేవి, చుండూరు రత్నమ్మ, సోం. గోవిందమ్మదేవి, గిడుగు లక్ష్మీకాంతమ్మ, ఆర్. రాధాదేవి, టి. వి, రత్నావళి, లక్ష్మీదేవి, దర్శి సుభద్రమ్మ, పెద్దాడ వెంకటసుబ్బమ్మ, జి వి. లక్ష్మి, తంగిరాల పార్వతి, చావలి సీతారామమ్మ, కోలాహలం వెంకట్రామయ్య, నాగదేశి ఈశ్వరమ్మ, భోగరాజు చిట్టెమ్మ, యర్రమిల్లి రుక్మిణమ్మ, వి. హేమలత, లక్ష్మి అగస్త్య, ఉ. సరోజిని, యు. సత్యబాలా సుశీలాదేవి, మూలా రాజేశ్వరి. "శశి", కొంపల్లి శారదాంబ, కాలకంధరం పద్మావతీదేవి, ఆర్. జనాబాయి, "కళ్యాణ జానకి", మానాప్రగడ సూరమాంబ, వేమూరి జ్ఞానాంబ, కాకర్ల సరోజనీదేవి, రాజామణి సత్యకుమారి, ఆర్. యస్. అన్నపూర్ణాదేవి, గుండాబత్తుల లక్ష్మీబాయి, గుడిపాటి మహాలక్ష్మి, రామచంద్రుని అన్నపూర్ణాదేవి, కె. సత్యవతెమ్మ, అక్కిన నాగామణి, D S రాజేశ్వరీపట్నాయక్, జాస్తి తులశమ్మ సత్తిరాజు సూర్యకాంతమ్మ, విల్లూరి నాగభూషణాదేవి, ఏ. పేరిందేవి, బి. సరోజనీదేవి, డబీర్ రామరత్నం, పురిటి రోహిణీదేవి, కుమారి రోహిణి, భావరాజు రాజ్యలక్ష్మి. కమలాదేవి, "నెమిలి", తనికెళ్ళ సన్యాసమ్మ, ఉప్పులూరి వసంతకుమారి, పోపూరి రాజేశ్వరి, ఎం. ఏ. పూర్ణావతిగార్లు.

స్త్రీ రచయితలలో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు — మా 'గృహలక్ష్మి" జననమందిన దాది లాలించుచున్నారు. వారే ప్రప్రథమమున "గృహలక్ష్మి" స్వర్ణకంకణము నందినవారు. వారు "గృహలక్ష్మి" తిరిగీ తలచూపగానే తమ "శారద లేఖ"లను తరచు పంపుచున్నారు. అంతేగాక అప్పుడప్పుడు ఇతర రచనల పంపుచుందురు. ప్రస్తుతం వారి 'బాల ప్రహ్లాద" అనే నాటకమును వరుసగా ప్రకటించుచున్నాము. ఇంకను ముగియ లేదు.

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు "సైరంధ్రి" అను పద్యకావ్యమును వరుసగా పంపుచుండగా ప్రకటించుచున్నాము, ఈమె కవిత్వప్రౌఢికి పలువురు తలలూపుచున్నారు. ఈమె సుప్రసిద్ధపండితులు. కవులునైన శ్రీ నాగపూడి కుప్పుసామయ్యగారి శిష్యురాలు.

నేడు 'రేడియో' వెలసియున్నది. స్త్రీలకున్ను అందులో ప్రసంగించుట కవకాశమిస్తున్నారు. అయితే రేడియో అందని మారుమూలాలలకును, రేడియోలకందని పురంధ్రీమణులకును కూడ మా "గృహలక్ష్మి" చేరుచున్నది; కావున స్త్రీల రేడియో ప్రసంగములను, స్త్రీలకు సంబంధించిన రేడియో ప్రసంగములను వారికై ప్రచురించుచున్నాము. మరియు విన్నవారికి విన్నసూక్తులు గాలికిపోయిన వనుకోకుండా అచ్చున కూర్చి, పదిలపరచుకొనుటకు అందించుచున్నాము ఈ రేడియో ప్రసంగములను శ్రీమతి అల్లాడి అన్నపూర్ణమ్మ, యం. సుశీల, సరస్వతీ చెన్నకేశవన్ ఎం. ఏ, సత్తిరాజు సూర్యకాంతమ్మగార్లు మా కందజేయగా కృతజ్ఞతతో ప్రకటించితిమి. ఇంక నితరులిట్లే అభిమానించి పంపుదురు అని ఆసించుచున్నాము. పురుషులలో నొక్క — శ్రీ తంగిరాల రాఘవరావు (మద్రాసు ప్రభుత్వపు డెవలప్‌మెంటుశాఖలో అసిస్టెంటు కమిషనర్) గారి ఖద్దరు ప్రసంగమును మాత్రము ప్రచురించితిమి. ఇవి విశేషతః స్త్రీలకు సంబంధించిన పరిశ్రమనుగూర్చియగుటచే వారు ప్రత్యేకముగ "గృహలక్ష్మి" కొరకే ఉత్తరువులుపొంది వాని నంపగా కృతజ్ఞతతో స్వీకరించి ప్రకటించితిమి.

1948 నవంబరు సంచికకు శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాణీ సాహిబావారు తమ అమూల్యమైన—దీపావళీ సందేశమునిచ్చి మా "గృహలక్ష్మి" పాఠకురాండ్రతో పరిచయ మొనర్చుకొని యున్నారు.

శ్రీమతి గొర్లె లక్ష్మిబాయమ్మగారు తాము దీసిన ఫోటోలను కొన్నిటిని 1947 డిశంబరు సంచికకు పంపగా ప్రచురించితిమి. ఆమెకీకళయందు నేర్పు 'వెన్నెలరేయి' ఫోటో తెల్పుచున్నది. నారీమణులీ కళను విశేషముగా నభ్యసింపదగును.

ఇక పురుషులపేర్లు విడిగా ప్రచురింపలేదు; ఇన్ని పురుషుల పత్రికలుండగా—ఒకటి రెండైననూ మా స్త్రీల పత్రికలను కూడ, దురాక్రమణ చేయుచున్నారా అని, మా స్త్రీ రచయితలు, పాఠకురాండ్రు కోపపడుదురేమో అని జంకితిమి.

అయినను వారిలో కొందరిని మాత్రమిక్కడ ప్రస్తావింతుము. వయో వృద్ధులు, మాయొక్కయు, మా గృహలక్ష్మి యొక్కయు శ్రేయోభిలాషులు, ప్రథమావస్థయందు 'గృహలక్ష్మి' గౌరవ సంపాదకవర్గలో నొక్కరు, విద్వాంసులు, విమర్శకులునైన శ్రీ వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు బహు శ్రమతో, శ్రద్ధతో పలు విషయములను వ్రాసి పంపుచున్నారు అందు ముఖ్యముగా నేనాటి యొక నారీమణి రచించిన "సోమపాట"ను సంపాదించి బహుళ వివరణముతో పంపినందులకు వారికి మేము కృతజ్ఞులము. విషయసంగ్రహణమందేమి, వివరణమందేమి, వారికున్న శ్రద్ధలో శతాంశమైన నేటి

 (57 పుట చూడుడు)

# నా చిన్ననాటి ముచ్చట్లు

డా. కే. ఎన్. కేసరి

---

## ఆడమళయాళము

ఆదిలో నేను మద్రాసునకు వచ్చినప్పుడు నేను చదువుకొనుచుండిన పాఠశాలలోని పిల్లకాయలు పెద్దవారలుకూడ ఆడమళయాళమును గురించి చిత్రవిచిత్రములైన కబుర్లను చెప్పుకొనుచుండిరి. ఆడమళయాళము యెక్కడనున్నదాయని ప్రాత క్రొత్త భూగోళశాస్త్రములను పిల్లవాండ్రు పలుమారు త్రిప్పుచుండిరి. ఈ మళయాళరాజ్యము పశ్చిమసముద్రతీరమున పర్వతప్రాంతముల మధ్యనున్న మహారణ్యమందున్నదని అక్కడి అయ్యవార్లు చెప్పుచుండిరి. ఈ రాజ్యము సుందరమగు ఫలపుష్ప వృక్షసమూహములతోను, నిర్మలమైన నీటితటాకములతోను, సెలయేళ్లతోను, జీవనదులతోను కూడిన నందనవనముతో సమానమగు వనమునందున్నదని చెప్పుచుండుట వినుచుంటిని. ఆడమళయాళమనగ గాంధర్వకన్యకలు విచ్చలవిడిగ విహరించుచుండు దేవలోకమనికూడ చెప్పుచుండిరి.

ఈ ప్రకారము ఆ కాలమున యువకులమనంబులను ఉద్రేకింపచేయు కథలను చెప్పుచుండిరి. మరియు ఆడమళయాళములో ఆడవారుతప్ప పురుషులేయుండరని చెప్పుచుండిరి. తప్పిదారి పురుషుడెవడైనను ఆ దేశమునకుపోయిన మళయాళమంత్రములతో వానిని వశపరచుకొని వారిండ్లలో బందీలుగ చేసుకొని వార్లచేత సేవచేయించుకొనుచుందురనికూడ చెప్పుటవినియుంటిని. ఈ ప్రకారము కథలెన్నియో చెప్పుచుండిరి. ఈ కథలన్నియు నా చిన్ననాటి ముచ్చట్లు.

నా పెద్దనాటి ముచ్చట్లను ఇప్పుడిక్కడ వ్రాయుచున్నాను.

ఆడమళయాళమనగ మాతృభక్తిగల పుణ్యభూమి. స్త్రీస్వతంత్రరాజ్యము. మన దేశమున పురుషుడు పుట్టుకతో అనుభవించు సర్వస్వతంత్రములనన్నిటిని అక్కడి ఆడవారు జననమొందిన దాదిగ అనుభవించుచున్నారు. మన ఆడవారు ఇప్పుడిప్పుడే వారనుభవించుచుండు హక్కులవంటి వానికొరకు ఆందోళనము చేయుచు క్రమముగ ఒక్కొక్కహక్కును సంపాదించుకొనుచున్నారు. మనదేశపుస్త్రీలుకూడ అన్నిహక్కులను

క్రమముగ సంపాదించుకొను శుభసూచనములు కనబడుచున్నవి. ఈ కలియుగమున పురుషునియుగముపోయి క్రమముగ స్త్రీయుగము రాగలదని అందరును ఆతురతతో వేచియున్నారు.

మళయాళరాజ్యము స్త్రీస్వతంత్రరాజ్యమగుటకు పెక్కు కారణము లుండినను ముఖ్యమైనవాటిని ఇక్కడ వ్రాసెదను.

కేరళోత్పత్తికి మూలపురుషుడు పరశురాముడని గడచిన మాసపుసంచికయందు వ్రాసియుంటిని. గనుక ఈదేశమునకు పరశురామక్షేత్రమనిన్నీ భార్గవక్షేత్రమనిన్నీ పేరు గలదు. పరశురాముడు ఉమామహేశ్వర్ల ఉపాసకుడు. పరమభక్తుడు. తాను సృష్టించిన కేరళరాజ్యము దుర్మార్గులపాలుగాకుండుటకు పార్వతీపరమేశ్వర్లను కాపలాకాయుటకు ప్రార్థించెను. అందుకు వారు సమ్మతించిరి.

ఈ పరశురామక్షేత్రము గోకర్ణము మొదలు కన్యాకుమారివరకు వ్యాపించి యున్నది. గోకర్ణమునందు శివుడును కన్యాకుమారియందు శక్తియగు కన్యాకుమారియును కాపలాకాయుచున్నారు. కేరళదేశము పరాశక్తి స్వాధీనమందున్నందున ఈదేశమంతయు శక్తియుతమైయున్నది. శక్తి అనగ అధికారము (Power) అనికూడ, అర్థము. నవశక్తుల లోను కుమారి బ్రహ్మచారిణి ఆగుటవలన సర్వశక్తులను సంపూర్ణముగ సమన్వయించు కొనిన నిర్వాణి. నిరంజని. ఎక్కడసౌందర్యము, సాహసము ఆకర్షణీయముగనుండునో అక్కడనే అధికారము (Power) కూడయుండును. "శివశ్శక్త్యా యుక్త ప్రభవతి" అను శంకరుని వచనము.

శక్తిలేనిశివుడు అశక్తుడు, శివుడులేనిశక్తిమూరణశక్తి. గనుక పార్వతీపరమేశ్వరుల సమ్మేళనముననే కేరళదేశమున మాతృప్రభ ప్రజ్వలించుచున్నది. అయితేఇక్కడ విశేష మేమనగా తత్వతః శివుడు పార్వతికి భర్తయేగాని — వరికి వివాహబంధమేర్పడలేదు. విష్ణుమూర్తి అడ్డుపడెనని యొకగాథ. ఏది ఎట్లైనను - ఇచ్చట దేవి భర్త్రాధీనమైన పరా ధీనగాదు ; కన్యాకుమారి - మాతృత్వము స్వతస్సిద్ధమైనను ఆ సృజన శక్తిని లోక కళ్యాణార్థమై తనయందే లీనమొనర్చుకొన్న ఆది శక్తి, పరాశక్తి.

కేరళరాజ్యమున మాతృపూజ ప్రతియింటను గ్రామమునను జరుగుచుండును. కాళీ, మహాకాళీ, భద్రకాళీ, కాత్యాయిని, మహేశ్వరి, గౌరిఅను నామములతో గ్రామ దేవతలున్నారు. ప్రతియింటను లక్ష్మి పార్వతి, సరస్వతి, మాధవి అనుపేర్లుగలవు. ఈ ప్రకారము దేశమంతయును శక్తియుతమైన ప్రభావమునుగల్గియున్నది. అయినను పైజెప్పిన కారణమువల్లనే నీ నవరాత్రులయందు మళయాళమున, విశేషముగ నేటికిని,

కన్యకాపూజ సాగుచున్నది. — ఆ 9 రోజులున్నూ, వారు కన్యకలకు రక్త చందనము, రక్తవర్ణ పుష్పములు, ఎర్రగా పండిన పండ్లు, కుంకుమ, కుంకుమపూవు-మొదలైన పదార్థములనిచ్చి ఆరాధింతురు. అనగా, వినియోగముకాని సృజనశక్తి (మాతృత్వము) అగు సంతశక్తి అంతర్భూతమైయున్న కన్యకాస్వరూపము నారాధించి శక్తి సంపన్నులు ఆగుచున్నారు. అట్టి పూజాధురంధములగుటచేతనే అచట స్త్రీలు-లోకవేడబమునకై మాతృత్వము నొక్కొకపట్ల నంగీకరించియు సర్వతంత్ర స్వాతంత్ర్యమును వీడక స్వాధీనలై పరాధీనతను దరిచేర నీయకున్నారు. అస లచటి కన్యలకు వివాహనిర్బంధమే లేదు; పలువురు అవివాహితలుగా నుందురు. ఆటగా బొమ్మరిల్లు నిర్మించి-ఆట గొల్లని దానిని చెరిపివేయుట కన్యకల కేళీవిలాస ప్రకృతి. అట్లే కన్యకా స్వరూపముననున్న శక్తికిన్నీ ఈ సృష్టియు, దాని లయమును లీలలు. పురుషులు నిట్టి కన్యకాయుపాసన కలవాటుపడ్డ వారగుటచే — భర్తృభావమున అధికారము వహింపక స్త్రీ స్వాతంత్ర్యమును శిరసావహించుచున్నారు-కావున ఈ క్రింద చెప్పబడబోవు ఆచార వ్యవహారముల కన్నిటికి ఈ పరతత్వమే మూలము.

ఇక్కడ ప్రతిశుక్ర మంగళవారములనాడు అంబాలయములలో రక్తపుష్పార్చన జరుగుచుండును. అబలలు ఆవేశముతో భక్తిపరవశలై గీతములనుపాడుచు చిందులు త్రొక్కుచుందురు. ఈ దృశ్యము వారి అబలత్వమును దెలుపుచుండును. ఆదేవతలకు నిత్యమును గొప్పఅండాలతో పాయసములను నైవేద్యముచేయుచుందురు. భక్తులకు కుంకుమ చందనాదులను ప్రసాదముగనిత్తురు.

## మాతృపూజ

కేరళమున గృహలక్ష్మిని కులదేవతగ పూజింతురు. కొమారుడు రాజు అయినను కన్నతల్లియెదుట చేతులుకట్టుకొని నిలుచుండుటయే వారిభక్తివిశ్వాసము. కూతుండ్లు అన్న దమ్ములందరు ఆమె ఆజ్ఞను రాజాజ్ఞగ పాలించెదరు. కుమార్తెలు తల్లినివిడిచిపెట్టి అత్తవారింటికిపోవు ఆచారము అక్కడలేదు. భార్యకావలసివచ్చినప్పుడు భర్త భార్యయింటికి వచ్చిపోవుటయే వారి కులాచారము. ఇందువలన అక్కడి ఆడనారికి అత్తపోరులేదు. ఆడబిడ్డల రాపిడియును నుండదు. తల్లియే కుటుంబమునకు అధికారి. కుటుంబఆస్తిఅంతయు ముఖ్యముగ ఆడవారికే చెందును. తల్లివారసురాలు కూతురు; కొడుకుకాదు. ఫలానితల్లి బిడ్డలందరుగాని ఫలానితండ్రిబిడ్డలనరు. కుమార్తె ఇంటిపేరు తల్లిదేగాని భర్తయింటిపేరు కాదు. తల్లిచనిపోయిన కుమార్తెలు కర్మచేయుదురు. తద్దినములను వారెపెట్టెదరు.. మనము వంశమును నిలుపుటకు కుమారునికోరునట్లుగా వారు కుమార్తెలను కోరుదురు. గనుక

వారింట స్త్రీదేవియే పూజ్యురాలు. ఇక్కడి స్త్రీల స్వాతంత్ర్యాపేక్ష తెలుపుటకు మరియొక్క చరిత్రాంశము కలదు. వీరు అబలలుకారు. కత్తిగట్టి యుద్ధములొనర్చి వీరోత్సాహము వెలిబుచ్చియున్న వారే.

కేరళులు ఆర్యులసంతతివారు. వారు ఆర్యావర్తమువిడిచి ఈదేశమునకు వచ్చుటకుముందే మనదేశమందుకూడ మాతృపూజయుండెను. అది క్రమముగ మరిగిపోయినది. ఇప్పుడు ఆలయములలోనందు దేవికిపూజలు జరుగుచుండినను గృహదేవికి పూజజరుగుట లేదు. అందువల్లనే మనదేశమునకు కొంతచీడబట్టియున్నది. రానున్న స్త్రీయుగమునందైనను మాతృపూజ చేయకుండిన ఇంతకాలము స్త్రీలుఅనుభవించిన అస్వతంత్రములను, పురుషులు అనుభవించకతప్పదని నావంటి వృద్ధులు హెచ్చరించవలసియున్నది.

మనతెనుగుదేశమున ప్రాచీనాచారము సంజ్ఞామాత్రముగనున్నట్లు తోచుచున్నది. అసలీదేవీపూజ మాతృపూజగా పరిణమించి వ్యవహారమునందు మాతృప్రాధాన్యత ఏర్పడినది. తల్లిపేరునుబట్టి ప్రసిద్ధులు పిలువబడేవారు. వైనతేయుడు, సాత్యవతేయుడు, గాంగేయుడు, రాధేయుడు, కౌంతేయులు, దేవకీనందనుడు ఇత్యాదులు – పితృ'నిర్దేశమైనను మాతృత్వము ప్రాధాన్యముగా పేర్కొనబడుటకు తార్కాణములు.

శాతకర్ణులు అనబడు ఆంధ్రరాజులు కొందరు గౌతమీ పుత్రశాతకర్ణి, మాఢారి పుత్ర శాతకర్ణి వాశిష్టపుత్ర పులమాయి - ఇత్యాదిపేళ్లతో శాసనములందు పిలువబడినారు. ఇంకను నేటికిని మనపల్లెటూళ్లలో – 'పుల్లమ్మగారి సుబ్బన్న' అనుట వాడుకగలదు. మన గ్రామములలో సంపన్నులగు సంసారుల ఇండ్లలో – స్త్రీలదే చాలవరకు పెత్తనము. ఇవన్నియు నశించని పూర్వస్థితిగతుల చిహ్నములై యుండవలయును.

తిరువాన్కూరు జనాభాలెఖ్ఖలరిపోర్టు (1891) లో నీ క్రిందివిషయము వ్రాయబడియున్నది:-

"నంబూడిరీ బ్రాహ్మణులకున్నూ తెలుగుబ్రాహ్మణులకున్నూ చాలసామ్యములున్నవని చెప్పబడుచున్నవి; అనగా, ఇంటిపేర్లు, మొక్కట్లు, కృత్రిమ మెరుగని ఖండిత వాదవైఖరులు, వేదపారాయణ కౌశలము, తోటలందు గృహములు నిర్మించుకొని నివసించుట, గృహనిర్మాణము, స్త్రీలుధరించు వస్త్రములపద్ధతి, సంగీతకమందభిరుచిలేమి(?) ఇత్యాదులు." • (654 పు)

వీనినన్నిటిని మనము అంగీకరించినను అంగీకరింపకున్నను ముఖ్యముగా - ఒక్కమాట తోచుచున్నది. ఆర్యుల తొలినాటి మాతృపూజ ఆంధ్రులు తెలుగుదేశమునకు వచ్చినపిదపకూడ చాలాకాలము విడువలేదు; మళయాళమున నేటికిని అదివిడువబడలేదు.

కేరళదేశము పుణ్యభూమి అని చెప్పియుంటిని. అందుకు కారణములను ఇక్కడ వ్రాయుచున్నాను.

తిరువనంతపురమున అనంతపద్మనాభ స్వామినిగురించి నేనిక్కడ ప్రత్యేకముగ వ్రాయనక్కరలేదు.

## కన్యాకుమారి

ఉత్తరదేశమున కాశీక్షేత్రమెట్లు పుణ్యభూమిగనున్నదో అటులనే దక్షిణదేశమున కన్యాకుమారి పుణ్యభూమిగనున్నది. ఈ జగన్మాతప్రభావమును జనులు వేయినోళ్ల పొగడుచుందురు. ఈ లోకేశ్వరి తన భక్తశిరోమణియగు పరశురాముని ఆజ్ఞానుసారమున సాధువులను రక్షించుటకు సాగరతీరమున వెలసియున్నది. ఈదివ్యతేజస్విని దివ్య స్వరూపమును దీపారాధనసమయమునందు దర్శించి తృప్తిచెందవలయును. దేదీప్యముగ ప్రకాశించుచుండు కల్యాణిముఖారవిందమును దర్శించిన పుణ్యాత్ములకు పునర్జన్మము కలుగదని పెద్దలు చెప్పెదరు. ఈదేవి ఇక్కడనుండు నవతీర్థములమధ్య వెలసియున్నది - సావిత్రీ తీర్థం, గాయత్రీతీర్థం, సరస్వతీతీర్థం, కన్యాతీర్థం, వినాయకతీర్థం, మాతృతీర్థం, పితృతీర్థం, సర్వతీర్థం, భీమతీర్థం, అను నీ 9 దియు నాతీర్థములు.

## శుచీన్ద్రం

ఈక్షేత్రమునకు శుచీన్ద్రం అను పేరువచ్చుటకు కారణంగలదు. దేవేంద్రుని శాప విమోచనమునకు ఈ క్షేత్రనాథుడగు స్థాణుమాలయమూర్తి అనుగ్రహమునుబడసి పాపవిముక్తుడాయెను. ఇంద్రుని శుచిచేసిన క్షేత్రముగనుక శుచీన్ద్రమని పేరుపెట్టిరట. ఇప్పటికిని దేవేంద్రుడు దేవలోకమునుండి దేవాలయమునకువచ్చి ఒకయామము పూజించి పోవుచుండునని అక్కడి పూజారిచెప్పుచుండును. ఈదేవాలయపు గాలిగోపురము మండ పముల శిల్పచాతుర్యము మధురదేవాలయమును పోలియిండును. ఇక్కడ యాత్రికుల సౌకర్యమునకు సర్కారు సత్రముగలదు. ఇది తిరువనంతపురం మహారాజువారి పరిపాలన లోనేయున్నది.

## శబరిఆశ్రమం

శ్రీ రామచంద్రమూర్తి పంచవటినివదలి శబరిఆశ్రమమునకువచ్చెను. ఈ శబరి ఆశ్రమము తిరువనంతపురమునకు సుమారు 160 మైళ్లదూరముననుండు మహారణ్యమున శబరిపర్వతమునీాదనున్నది. ఈ శబరిపర్వతముమీాదనుండు అయ్యప్పన్ అనుదైవము హరిహరాదులకు పుత్రుడు. విష్ణుమూర్తి మోహినీరూపమునుదాల్చి శివుని మోహింప

చేసినప్పుడు వారిరువురకు పుట్టిన దేవుడని స్థలపురాణము చెప్పుచున్నది. ఈ క్షేత్రమున ప్రతిసంవత్సరము కేరళదేశమునుండి వేలువేలుగా జనులు శబరికొండనెక్కి అయ్యప్పను పూజించివచ్చుచుందురు. శబరిఆశ్రమమునకు పోవు భక్తులందరు నీలివస్త్రములను ధరించి విభూతిరేఖలను దట్టముగదిద్దుకొని చేత త్రిశూలములనుధరించి శివగీతములనుపాడుచు శబరికొండనెక్కెదరు. ఇది అరణ్యమగుటవలన దోవ డొంకలుండవు కాలిఁడకనే పోవలయును. అడవికట్టెల దివిటీలతో రాత్రివేళ నడిచెదరు. ఈ దివిటీలవెలుతురుకు పాటలశబ్దములకు అడవిమృగములు వీర్లనుచేర రావు. గుంపులు గుంపులుగ పోవుచుందురు గనుక నిర్భయముగను ఉల్లాసముగను ఈ యాత్రకు పోయివచ్చెదరు.

ఆశ్రమముచుట్టును పంపాసరోవరము, ఋష్యమూకపర్వతము, నీలాద్రి, శ్రీరామవనం మొదలగు పురాతన పవిత్రక్షేత్రములుగలవు. ఈస్థలములన్నియు ఈపేర్లతోనే యిప్పటికినియున్నవి-(ఇచటివారైతే ఆ యాత్రప్రదేశములతో రామాయణగాథకు సంబంధము కల్పించుకొనియున్నారు. గోదావరిలో శబరియను ఉపనది కలియుచున్నది. కాని బళ్లారి ప్రాంతమున ఋష్యమూకపర్వతాలు కలవని చెప్పుకొందురు.)

## మా రు తి ప ర్వ త ం

అనగ హనుమంతునికొండ. దీనిని మళయాళములో మరుత్వామలె అందురు. హనుమంతుడు మృతసంజీవికొరకు సంజీవిపర్వతమునకుపోయి వాయువేగ మనోవేగములతో వచ్చునప్పుడు చేతనున్న సంజీవి అణుమాత్రము ఈ కొండమీదపడి, అప్పటినుండి అక్కడ ఆమూల్యమైన ఆయుర్వేద ఓషధిరాజములు పుట్టుటవల్ల ఈ కొండకు మారుతిపర్వతమని పేరువచ్చినది. భక్తాగ్రేసరులు భజనసలుపుచు భగవంతుధ్యానించుటకు ఈకొండ చాల అనుకూలముగనుండును. మలయమారుతము నిర్మలోదకములు ఇక్కడసమృద్ధి. ఆహారముదొరకును. క్రిందనుండిఒక మైలుదూరము కొండయెక్కిన అక్కడ శివక్షేత్రముగలదు. పుష్కరిణియునుకలదు. వేసవికాలమున శ్రమతీర్చుకొనుటకు విశాలమైన వటవృక్షములున్నవి. వచ్చిపోవువారికి వసతిగృహములున్నవి.

యోగాభ్యాసముచేసుకొనువారికి యోగమంటపమును నల్లరాతితో రమ్యముగ కట్టబడియున్నది. యోగీశ్వర్లు నివసించుటకు పెద్దమందిరముకూడ కట్టబడియున్నది. ఈ వసతులన్నియు తిరువనంతపురం మహారాజు యేర్పాటుచేసినవి.

## ఆ ల్వా యి న ది

మారుతిపర్వతమునుండి వర్షకాలమున ఓషధులసారము ఆల్వాయిలో పారు పెరియారునదిద్వారా కొట్టుకొనివచ్చును. ఈకారణమున ఆల్వాయినదీస్నానము అనారోగ్య

లకు అనుకూలముగనున్నది. వేసవికాలమున దూరదేశములనుండికూడ రోగవిముక్తులగుటకు ఇక్కడికివచ్చి సుఖముగవెళ్లెదరు ఈపట్టణము తిరువనంతపురము సంస్థానమునకు చేరినది. ఇక్కడ గొప్ప కర్మాగారములు, విద్యాలయములుగలవు. ఈరైలుస్టేషన్ తిరుచూరుకు మెర్నాకులమునకు మధ్యనున్నది.

## సహ్యాద్రి

ఈ పర్వతాగ్రమున పరశురాముడు తపస్సుచేసుకొనునప్పుడే కేరళరాజ్యమును సృష్టించెను.

## కాలడి

శ్రీ ఆదిశంకరులు జన్మస్థలము. రమణీయమైన చిన్నగ్రామము. నదీతీరముననున్నది. మరియు యిక్కడ ఆలప్పళ్ళి, అంబలప్పళ్లె మొదలగు గొప్పక్షేత్రములుగలవు. ఒకొ్కక్కటి ప్రత్యేకముగ ప్రసిద్ధిచెందియున్నవి.

## త్రిప్రయార్

త్రిప్రయార్ అనుపేరుగల శ్రీ రామచంద్రమూర్తి క్షేత్రము తిరుచూరుకు 14 మైళ్లదూరముననున్నది. ఈక్షేత్రము కొచ్చిరాజ్యమున చాలా ప్రసిద్ధక్షేత్రమగుటవలన నేనక్కడికివెళ్లి శ్రీరాముని దర్శించిరావలయుననే కోరికయుండెను. ఆంధ్రదేశమున భద్రాద్రి యెటుల ప్రసిద్ధమో ఈ దేశమున త్రిప్రయారు అటుల ప్రసిద్ధముగనున్నది. ఇదియొక నదీతీరముననున్నది. గొప్ప ప్రహరీగోడలు యెత్తైన మంటపములుగల విశాలమైన దివ్యక్షేత్రము. అతిపరిశుభ్రముగనుండును. రాముడు లంకాధిపునివధించి తిరుగవచ్చునపుడు ఈ నదీతీరమున విశ్రమించినట్లు స్థలపురాణముగలదు.

శ్రీ రామచంద్రమూర్తి సీతాసమేతుడుగనుండు దృశ్యము ఈ గర్భగుడియందు కానవగును. గాంభీర్యమైన విగ్రహములు. గర్భగుడినిండుగ అఖండజ్యోతులు వెలుగుచుండును - అర్చనలు దీపారాధనలు సదా జరుగుచుండును. ముఖమంటపమున నంబూద్రి బ్రాహ్మణులు వాల్మీకిరామాయణమును పారాయణమును చేయుచుందురు. నదిఒడ్డున స్నానఘట్టమును మలిచిన నల్లరాళ్లతో కట్టబడియున్నది – ఇక్కడివిశేషమేమన పురాతనమునుండి నదీఘట్టమున వివిధరకములగు మత్స్యములుండుట. యాత్రికులు వాటికి దంపుడుబియ్యమును ఆహారముగవేయుదురు. ఈ దంపుడుబియ్యమును దేవాలయమునందే విక్రయించెదరు.

ఈ బియ్యమును తిని ఈమత్స్యములు తెగబలిసియుండును. నీళ్లవద్దను నిలుచుండి పిలిచిన గుంపులు గుంపులుగ వద్దువద్దకువచ్చును. ఈమధ్య హరిజనులప్రవేశము ఈదేవాలయమునందు జరుగుటవలన హరిజనులు మత్స్యములన్నిటిని మాయముచేసి పుణ్యము కట్టుకొనిరి.

తిరుచూరుకు సమీపముననేయున్న గురువాయూరు అను ప్రసిద్ధ నారాయణ క్షేత్రమునుగురించి డిసెంబరుమాసపు గృహలక్ష్మిలో కానగును.

ఇంకను అనేక పుణ్యక్షేత్రములు ఈరాజ్యమునందుగలవు.

కొచ్చిరాజ్యమునకంతయును గొప్పశివాలయము వడకన్నాధక్షేత్రము తిరుచూరునందున్నది. తిరుచూరుకు సమీపముననే గురువాయూరునందు శ్రీ మహావిష్ణువు వెలిసియున్నాడు. త్రిప్రయారను క్షేత్రమున శ్రీరామచంద్రమూర్తి గొప్ప దేవాలయముగలదు. ఈరాజ్యమున ఇంకయును ననేకపుణ్యక్షేత్రములుగలవు. ఒక్కొక్కచోట ఒక్కొక్క మహిమగలదు.

ఈ దేవాలయములన్నిటిలోను తెల్లవారి 4 గంటలుమొదలు రాత్రి 10 గంటలవరకు ధూప దీప నైవేద్యములతో కళకళలాడుచుండును. మనదేశపు దేవాలయములలో దేవునికి మొక్కుబళ్లకు టెంకాయలను కొట్టెదము. ఈదేశపు దేవాలయములలో పెట్లదిమ్మెలనుకాల్చెదరు. ఒక్కొక్కరు 100, 200 వరకు కాల్చెదమని మ్రొక్కుకొనెదరు. అందువలన మ్రొక్కుబళ్లు తీర్చుకొనువారు ఉదయముమొదలు రాత్రివరకు గుండ్లను కాల్చుచుందురు. అక్కడుండువారు గుండ్లశబ్దములకు తాళలేక చెవులను మూసుకొనుచు గుడిప్రదక్షిణములను చేయుచుందురు. ఈ దేవాలయములు తిరువనంతపురం కొచ్చిరాజుల పరిపాలనక్రిందవుండుటవలన దినచర్య చక్కగ జరుగుచున్నది. తిరువనంతపురంరాజు పద్మనాభుని దాసుడు. కొచ్చిను మహారాజు వైదికశిఖామణి. దేవాలయములలో జరుగు ఉత్సవాదులకు వీరు హాజరగుచుందురు. నిరాడంబరముగ రాజ్యపాలనచేయు మహాపురుషులువీరు.




## వేప

వేపఇగుళ్లు తెచ్చి - పిడికెడు ఇగుళ్లు, పదిమిరియాలు, అర్ధటీస్పూను ఉప్పు-జీలకర్ర అర్ధ స్పూను - పసుపుపొడి అర్ధస్పూను-పై చెప్పినవన్ని వేడినీళ్లతో మెత్తగనూరి చింతగింజంత మాత్రలుచేసి రోజుకు మూడుమాత్రలు చొప్పున ఉదయం పరకడుపున పుచ్చుకొన్న, అజీర్తి, క్షయ, మలేరియా టైఫాయిడ్, కలరా, అమ్మవారు, ఈ లాంటి అంటువ్యాధులు రాకుండా చాల వరకు కాపాడును. పిల్లలకైతే ఒక మాత్ర చాలును. నెలల బిడ్డలకు ఒక స్పూను నీళ్లలో కలిపి ఎడియపోసి తాగించవలయును.

(గతసంచిక తరువాయి) —కాకాణి మీనాక్షి సుందరమ్మ.

## శిశువ్యాధులు - చికిత్సలు

5 విరేచనములు:-పిల్లల ఆరోగ్య, అనారోగ్యములు పిల్లలకగు విరేచనములపైననే ఆధారపడియుండును. విరేచనములు నిలిచి జీర్ణశక్తి హెచ్చించుటకు వకజాజికాయను నిప్పులలోవేసి వెచ్చచేయవలయును. చల్లారినపిదప మెత్తనిపొడి చేయవలయును. పొడికిసమానముగ సోడాను కల్పవలయును. ఆ పొడిని సుమారు మూడు గ్రెయినుల చొప్పున గోరువెచ్చని నీటిలోగాని, పంచదారలో గాని, తేనెలోగానికల్పి రోజుకు రెండు పర్యాయము లివ్వవచ్చును.

మరియొకపద్ధతి:-దాల్చిన చెక్క, లేక లవంగపు చెక్కయనికూడ అందురు. దానిని 1 తులము తీసుకొని మెత్తగ చూర్ణించి అందులో కొంచెము తేనె కల్పి యిచ్చిన విరేచనములగుట నిల్చును. మలబంధము చేయదు. పొట్టఉబ్బదు.

6 మలబంధము:-ఆముదము మంచిది, ఆరోగ్యకరము, ఆయుర్వృద్ధి; అట్లని ప్రతిరోజు విరేచన సాధనచేయుట అంత మంచిదికాదు.

ఉగ్గుపాలలో కరక్కాయ రెండు చుట్లు అరగదీసి యిచ్చిన చాలును.

శాంతి యుతమైన చికిత్స. తల్లిపాలు, పోతపాలు డబ్బాపాలు వాడుటవల్ల యెట్టి దోషములున్ననూ కరక్కాయను వాడుటవల్ల పోవును.
వసకొమ్మును నీళ్లలో అరుగదీసి ఉగ్గుపాలలోగాని తేనెలోగాని కల్పియిచ్చిన కాలవిరేచనమగును.

మూడవపద్ధతి:-మాచికాయకూడ మంచిది. నోటిపూత పేగులకు వేడెక్కినగాని రాదు. నోటిపూతకలిగియున్న బిడ్డలకు తల్లిపాలైనను రుచింపవు. ఇట్టిబిడ్డలకు విరేచనములగుచుండిన మాచికాయను నిప్పులలోవేసి దోరగా కాలినపిదప తీసి చల్లార్చి మెత్తగాపొడినూరి ఆపొడిలో తేనెకల్పి నాలుకకురాచిన నోటిపుండు ప్రేగులవేడిమి తగ్గి విరేచనములుఅగుట నిలుచును.

7 చిన్నబిడ్డచేష్టలు:- 1 చిన్నము మంచి కస్తూరిలో 1 చిన్నము హారతికర్పూరమునుచేర్చి గోరువెచ్చని నీళ్లలోకల్పి యివ్వవలయును. విరేచనముసాఫుగా అయిన సుగుణమని యెంచవలయును. విరేచనముగాకున్న పొట్టను, కాళ్లను గోరువెచ్చని ఆముదముతోచమిరి నరములు సళ్లునట్లు చేయవలయును. మాడు వేడి తగ్గుటకు ఆముదమును పెట్టుచుండవలయును అని కొందరి అభిప్రాయము. పిల్లలను చంకలోనిడికొని అల్లిబిల్లిగ అతివిసరుగ తిరిగెదరు. అప్పుడు శోషించిన నరములకు స్మృతివచ్చును. ఇదియొక భయంకరమయినవ్యాధిఅనియే చెప్పనగును. ఇట్టి స్వల్ప గృహచికిత్సలకు, కన్నతల్లుల ఉజ్జాయింపు పరిమాణముకంటె డాక్టర్ల నియమితపరిమాణములు అన్నివేళల ఉపకరించవు గావున యిట్టివి తల్లులే నియమించుకొనవలయును.





నెల్లూరి శ్రీ రంగనాథస్వామి దేవాలయమునుగూర్చి వ్రాస్తూ—వారికి నైవేద్యమయ్యే భక్ష్య భోజ్యముల పాక విశేషమును వేరుగా పాకకళ శీర్షికయందిస్తామని వ్రాసియున్నాము. నెల్లూరికి సమీపముననున్న నరసింహుల కొండమీదను, నెల్లూరిలోని శ్రీ రంగనాథస్వామివారి ఆలయములోను మటపళ్లి కైంకర్యపరులు (వంటచేయువారు) చెంగల్పట్టుకు సమీప గ్రామస్థులైనవారు; వీరు వైష్ణవులని చెప్పనక్కర లేదు. అందుచేత కొండమీదివారు నెల్లూరివారు అవసరముకొలది వెళ్ళివచ్చుచు పని పాటలకు సర్దుకొనుచుందురు. కావున ఉభయ పాకవిధానములు ఒక్కటే.

## —పులిహోర తళియ—

"తళియ" అనగా 3½ శేర్ల బియ్యము, (ఒక నెల్లూరి ముంతెడు). ఈ తళియ శబ్దము నేడు కేవలము ద్రావిడ పదముగా పరిగణింపబడుచున్నది. నన్నయభట్టును, తిక్కనయు తమతమ భారత భాగములందు ఈ పదమును విరివిగా వాడియున్నారు. కావున సుమారు రెండు శతాబ్దములు ఈ పదము తెలుగు దేశమున (తొలుత గోదావరీ తీరమున, పిదప పినాకినీ తీరమున) వాడుకలోనున్న నిదర్శన మిట్లు కాన్పించుచున్నది. అయితే—అక్కడ ఆ పదమున కర్థము—భోజనపాత్ర యని అర్థము.

పిదప నాపదము భోజన పదార్థమునకే అన్వయము కాజొచ్చినది, ఇప్పటికి వీరాంధ్రులగు తెలుగు వైష్ణవులు సహా తమ యిండ్లలో వైష్ణవ పరిభాషగా 'తళియ'ను ఈ అర్థముననే వాడుదురు. అయితే దేవాలయములందు ఈ పదము భోజన పదార్థ పరిమాణమున కన్వయము. ఈ అర్థములలో నేది వెనుక ముందు లనునది శబ్ద శాస్త్రపరులగు పెద్దలు తర్కింపదగును. అందుచే కేవల శబ్ద చర్చ వదలి నోరూరుచున్న పాఠకులకు పులిహోర పడియు, పాక విశేషమును తెలుపుదును.

## —ఒక తళియకు—

| | | | |
|---|---|---|---|
| మంచి పాతబియ్యము | 3½ శేర్లు | మెంతులు | 1 పలము |
| ఉప్పు | ¼ శేరు | శనగలు | ¼ శేరు |
| మిరపకాయలు | 4 పలాలు | (వీనిని గుండలుగాచేసి చేర్చునది) | |
| చింతపండు (విత్తనములేనిది) | ½ వీశె | మినప పప్పు | ¼ శేరు |
| ఇంగువ | 1 తులము | మంచి నువ్వులనూనె | ½ వీశ |
| ఆవాలు | 4 పలాలు | కరివేపాకు తగినంత | |

ఈ పాళ్ళతో మామూలుగా పులిహోర చేసినట్లే చేసిన చాలును. నెల్లూరి శ్రీ రంగనాథస్వామి వారి పులిహోర వైష్ణవకూటములందు చాల ప్రసిద్ధి వడసినది. శ్రీరంగము, కంచి, తిరుపతి మున్నగు దివ్యస్థళముల పులిహోర ప్రసాద మారగించినవారున్ను దీనినే మెత్తురు. ఇందుకు కారణములు పై దివ్య స్థళములలో మిరపకాయలకు బదులు మిరియాలపొడిని వాడుదురు. మిరపకాయ (17 వ శతాబ్దము

పోర్చుగీసు వారిచే మన దేశమునకు తీసుకొని రాబడినది) విశ్వామిత్ర సృష్టియని పూర్వాచార పరాయణులగు ఛాందసుల అభిప్రాయము. ఇట్లే కొంత కాలముక్రిందట విదేశములనుండి తేబడిన నూతనములగు కాయగూరలను—మన దేశమున విస్తారముగ పండినను—విశ్వామిత్ర సృష్టియని పేరుపెట్టి పరిహారణీయములని వైదిక శిఖామణులు నిర్ణయించిరి. కడకు దేవతల పితృ దేవతల నారాధించుపట్లనైన వీరు వానిని విసర్జింతురు. అయితే నెల్లూరి వైష్ణవులకు ఈ ఆచారమంటలేదేమో! ఇంతకు మిరపకాయ రుచి మిరియమున కెట్లువచ్చును? ఇంతేగాక—నెల్లూరి బియ్యమున్నూ ప్రశస్తమైనవి. అదియు మరొక కారణము కావచ్చును.

# ఇంటిపనులలో మెళుకువలు

చదువుకొన్నందువల్ల మరోలాభం—నీవు పిల్లల చదువును చిన్న క్లాసులలోనైనా శ్రద్ధగా గమనించవచ్చు.

* * *

నీ పని నీవు చూచుకుంటూనే నీ బిడ్డలు శ్రద్ధగా చదువుతున్నారా లేదా అనేది గమనించవచ్చు. ముఖ్యంగా వాచకం చదివేటప్పుడు—ఉచ్చారణ సరిగా ఉందా లేదా అని గమనించి సరిదిద్దవచ్చు.

* * *

వాచకం సరిగా నేరిస్తే పిదప పెద్దవాళ్లైన తర్వాత సంభాషణా చాతుర్యమున్నూ ఉపన్యాస సామర్థ్యమున్నూ కలుగుతుంది. సంభాషణా చాతుర్యముండియున్నూ ఉపన్యాస రంగమున 'సభాకంపము'చే వణికేవారు చాలామంది ఉన్నారు. అందుచేత బిడ్డలు చిన్న వయసులో నదురుబెదురులేక గొంతెత్తి చదువ నేర్పవలెను దీనిని నీవు గమనించాలి.

* * *

అట్లని పెంకు లెగిరిపోవునట్లు, వగర్పువచ్చేటట్లు చదువరాదు. అట్లా కొంపలు మునిగి పోతున్నట్లు అరుస్తూ చదివితే—అసలు మనసునకు పట్టదుకూడా. అందుచే అంత కొండకేకలతోగాక, కేవలంనోటిలోనే, గొణుగుకోక—చల్లగా సౌమ్యంగా, అక్షరములు,-మాటలు మ్రింగక, అర్థక్రమమున, తగిన స్వరభేదములతో విరామములతో బిడ్డలు చిన్న క్లాసుల పాఠములు చదువ నేర్పవలయును. దీనినంతా గమనించవలెనంటే ముందు నీకు చదువువచ్చి ఉండవలె. బిడ్డల చదువు గమనించవలెననే శ్రద్ధ ఉండవలె.

* * *

అయితే క్రమంగా బిడ్డలు - పెద్దక్లాసుల కెక్కు—కొలది స్వరము తగ్గించి, లోలోపల చదువుకునే అలవాటు చేసుకోవాలి. దానికిన్ని నీ శిక్షణ, గమనము అవసరము. రానురాను చూపుమాత్రంచేతనే బిడ్డలు చదవనేర్పవలెను. ఎంతకాలంలో ఎంత చదివి అర్థంచేసుకోగలుగుతున్నాడనేదిన్నీ తెలిసి-నీవు శిక్షణ ఇవ్వవచ్చు. ఏదైనా మంచిమాసపత్రిక చేతికిచ్చి దానిలోని కథ, వ్యాసము, శాస్త్రవిషయము, పద్యము, పాట-ఎంతసేపులో చదువగల్గునో, ఎంత త్వరగా చదివిన బోధపడునో తెలుసుకొనుచు క్రమముగా త్వరితము నభ్యాసము చేయవలయును.

* * *

పిల్లలు పాఠశాలల్లో అయ్యవారు క్లాసులో నేర్పగా నేర్చుకొనునది, గాటిలో మేత. ఇంటివద్దచేయు అభ్యాసమే చదువునకుపుష్టి. బయట ఉద్యోగము, సంపా

ద్యము, అంగటి వెచ్చము మున్నగు పనులొనర్చి ఇంటికి అలసివచ్చు తండ్రి బిడ్డల చదువులను చూడజాలడు. ఆ భారమునీదే. కావున ప్రతినిత్యము బడికిపోవు నీ బిడ్డలను ఈ విషయమున నీవు అరయవలయును.

* * *

పిల్లలకు బడిలో చదువు గంటలవారిగా విషయముల వారీగా ఉపాధ్యాయులు చెప్పి పోవుచుందురు. ఆ ఏర్పాటు నొక పట్టికగా తయారుచేసి బిడ్డలకు చెప్పుదురు. ఆ పట్టికను ముందు పరిశీలింపుము.

* * *

నిన్నటి రోజున పాఠశాలలోగడచినదాని విషయము తెలుసుకో; దానిని నీబిడ్డ ఈ రోజు నెమరువేయునట్లు చేయుము. ఈ రోజు పాఠ్యక్రమముచూడు. అందుకా బిడ్డ తయారుగా నున్నదా లేదా గమనించుము; లేకున్నచో తయారగునట్లు చేయుము. గడచిపోయిన పాతపాఠములు మరపునకు రాలేదుగదాయని—రోజున కేవిషయమునవో, ఒకటి రెండు పాంశముల వంతున ప్రతిరోజు అడిగి తెలియుచుండవలయును.

* * *

అయ్యవార్లు ఇంటివద్ద చూచివ్రాత, తర్జుమా, లెఖలు, దేశపటములు వేయుట, మున్నగు పనులు చేసుకొని రమ్మని చెప్పును. నీ బిడ్డలు ఆటలమరిగి — వానిని సకాలమున చేయకయో, సరిగచేయకయో బడిలో అయ్యవారిచేత దెబ్బలుమున్నగు శిక్షల పొందుటయు, తోడిపిల్లలలో అవమానపడుటయు జరుగును. నీవు ఇంటివద్ద శ్రద్ధగా వీనిని గమనించుచో నీ బిడ్డలు అందరిలో మన్నన పొందుటేగాక పిదప జీవితమునకూడ ఇది అలవాటై సుఖపడుదురు.

* * *

సామాన్యముగ నీ యింటివద్ద చేయమన్న పనులు చేయజాలకపోవుట అవి సహాయములేక చేయజాలని కష్టమైనవగుటచేతనే; కావున నీవామాత్రమైన నేర్చియుండి-వారికి సాహాయ్యము చేయవలయును.

* * *

నీ బిడ్డలు పరీక్షలు ప్యాసైనారని సంతోషించుటయో ఫెయిలైనారని చింతించుటయో, ఆగ్రహించుటయో—మాత్రమేకాదు. వారి విషయము సం॥ము పొడుగునా కనిపెట్టుచు వారుత్తమ తరగతిలో పరీక్షలలో నుత్తీర్ణులగునట్లు వారి నరయుచు సహాయ్యపడుచుండవలెను. వంట, ఇంటిపనులు చేసుకుంటూనే ఈ పనులు చేయవచ్చును.

ఈపనులన్నియు చేయగలితేనే నిన్ను 'చదువులసరస్వతి' అనేది.

---



# బ్రతుకుతెరువు



## తేనెపట్టులు

తేనెపట్టులను తేనెటీగలు వాటంతటవియే పెట్టును; అట్లే ఆ తేనెను ఆరగించును కూడ. అందుచేత తేనెటీగల నైజమును, అవి పనియొనర్చుపద్ధతిని ఎంతో జాగ్రత్తగా కనిపెట్టిన పాశ్చాత్యులు ప్రయత్నపూర్వకముగా తేనెపట్టులను పెట్టించుటనుకనిపెట్టిరి. వాటంతటవికూర్చినప్పుడు - అవి నానాపుష్పములనుండి కూర్చితెచ్చును ఏమనగా దానికి ఒక్కచో పూలనమర్చువారుండరు. సమృద్ధిగా పూలున్నచోట స్థలముపురదు మనము తినుబండారములను, ధనధాన్యములను ఎట్లు భద్రముగా రహస్యస్థలముల దాచుకొందుమో అట్లే అవికూర్చుకున్న ఆహారమును దాచిపెట్టుకొనును. అందువలననే తేనెపట్టులను తేనెటీగలు పెద్దమానుల పైకొమ్మలందును, పొదలలో మరుగుమూలలోను పెట్టుచుండును. పువ్వు పువ్వునకువెళ్లి తేనె తెచ్చుటకును, వీలైనంత పైకెగరి దాచుటకును, భగవంతుడు వానికి రెక్కలిచ్చినాడు. అందుచేత కృత్రిమముగా తేనెపట్టులుపెట్టించుట ముందు వానికి రహస్యప్రదేశముల మనమే తయారుచేసి వాని ఎదుటనుంచవలయును! అందుకుగాను ఒకవిధమైన పెట్టెలను తయారుచేయుదురు. అ పెట్టెలుకొన్ని అంగళ్లలో అమ్మబడును. ఆపెట్టెలను తెచ్చి తగుస్థలమున నీయింటి వెలుపల కాళీస్థలమున అమర్చవలయును.

అవినానాపుష్పముల తేనెలను తెచ్చి అన్నియు కలగల్పుచేయకుండా ఏకవిధపుష్పము బాహుళ్యగానున్నప్రదేశమున నీపెట్టెఅమర్చి - తేనె కూడబెట్టగానే తీసివేయువలయును. మాటవరుసకు, మీవాకిట పెద్దవేపచెట్టుండును. అక్కడ అమర్చినచో వేపపూలతేనె అమరును. మీఆవరణములో వేపచెట్టులేదు. పొరుగిండ్లవాకిళ్లనున్నవి, రోడ్డుపైనున్నవి. మీయింటిచూరునకు ఈ పెట్టెఅమర్చినచో - ఆవేపచెట్లనుండి తేనెగ్రహించి మీపెట్టెలో పెట్టును. బాపట్ల, నెల్లూరు, రాజమహేంద్రవరము, కాకినాడ, పాలకొల్లు, కోనసీమ, నంద్యాల, పెనుగొండ, తాడిపత్రి, కోడూరు, పాణ్యాం, - చిత్తూరు, మున్నగుప్రాంతముల ప్రత్యేకమైన తోటలేగాక - ప్రతియింటను ఏవో అయిదారైన ఫలవృక్షములుండును: చాలు. అవి బాగా పుష్పించియున్నపుడు ఈపెట్టెలనుంతురు.

పల్లెటూళ్లలో ముఖ్యముగా మెట్టపొలాలున్నచోట - ధనియము, వేయుచుందురు. ధనియము పూతబట్టియున్నరోజులలో ఆచెట్లమధ్య నీపెట్టెలుంచిన మంచి తేనెలభ్యమగును. ఇది చాలా పైత్యహరమట. అట్లే మామిడిపూతరోజులలో, గుమ్మడిపాదుల రోజులలోను, - మల్లెపూవులరోజులలోను ఈపెట్టెలమర్చి తేనెసేకరించవచ్చును.

ఈపెట్టెలలో స్థానమును పెట్టి - తేనెటీగల నాకర్షించవలయును. తేనెపట్టిన మీదట -తేనెటీగల దురుసు నెదుర్కొని తేనె గ్రహించవలయును. ఈ తేనె గ్రహించుట కొంత కష్టతరమైనపని. తేనెపెట్టె తాకగనే తేనెటీగలువచ్చి కుట్టును. కావున ఇందుకుగాను గొంగళిబురఖాలు తయారుచేసి అమ్ముదురు. ఈగొంగళిలోదూరి అవి కుట్టలేవు. కళ్లు కుట్టకుండా మూతఅద్దములజోడు పెట్టుకోవలయును. తప్పిదారి దాగియున్న ఈగలు-చేతులుకుట్టవచ్చును. అందుకుగాను చేతులకు నాజూకైన రబ్బరుమేజోళ్లును ఏర్పడియున్నవి. ఈవిధముగా సం॥ మునకు ఒక్కగాలను తేనెజాగ్రత్తచేసినను - అది పిల్లలకు పెద్దలకు మంచిఆహారము మరికొంత శ్రద్ధగా, విరివిగాచేసినచో బ్రతుకుతెరువున్నూ. ఎంతపేదవారైనను - ఈవిధముగా పెట్టెలుపెట్టుకొనుటకు సంఘమ్ములనాశ్రయించి, -వారిదొడ్లలో వీని నేర్పాటుచేయవచ్చును. ఆయావస్తువులు ఎక్కడుదొరుకునదిన్ని, ఇంకా నీవిధానపువివరములున్నూ వ్యవసాయశాఖకు వ్రాసిన వారుచెప్పగలరు.



# రేడియో

## ఆ మాటకొస్తే—అత్తగారూ—ఒకింటికోడలే

శ్రీమతి యం. సుశీలగారు

ఆమాటకొస్తే - సంఘంలో జన్మించిన ప్రతిస్త్రీ - ఏకొద్దిమందో - పెళ్లి చేసుకోనివారు తప్ప - పెళ్లి చేసుకోగానే ఓయింటి కోడలవుతుం దన్నమాట, అందరికీ తెలిసినదే. పెళ్లి అనగానే స్త్రీ ఒకింటి కోడలైందన్నమాట. కోడలు కాకుండా పెళ్లిచేసుకొన్న స్త్రీని సంఘంలో కంచుకాగడా వేసి వెతికినా కనిపించదు. అందుచేత, నన్నడుగితే - స్త్రీపట్ల కల్యాణానికి రూపాంతరం - కోడలు - అంటాను. అటువంటప్పుడు అత్తగారు మాత్రం, కోడలవకుండా, అత్తగా రవలేదుగా.

ఏ సంఘం చూడండి - ఎంత అనాగరికమైన జాతినైన చూడండి - అత్త కోడళ్లు కనిపిస్తారు. అఖరికి ప్రపంచ సాహిత్యంలో కూడా, గృహస్థ జీవితానికి సంబంధించిన ఘట్టాలలో అత్తకోడళ్ల పాత్రలు గోచరమవుతాయి. చూశారా, సంఘంలో అత్తా కోడళ్లు యెటువంటి ప్రముఖమైన పాత్ర వహిస్తారో. పాశ్చాత్య కుటుంబం అవిభక్తకుటుంబం కాదు కాబట్టి, మనకుటుంబంలో కన్పించే అత్తాకోడళ్ల లాంటి వ్యక్తులు కనిపించరు. కోడండ్రికం అనే వింతప్రవర్తన గోచరించదు. అందుచేత, హిందూగృహంలో కనిపించే అత్తగారు వంటి అత్తగారు, పాశ్చాత్యగృహంలో కనిపించదు. ఐనా వారిలోకూడా అత్తగార్లని ఆక్షేపించటం, వుందని, వారి గ్రంథాలద్వారా, సినిమాలద్వారా తెలుస్తూంటోంది. ఆగృహంలోని అత్తా కోడళ్లు సామరస్యంతో, సుహృద్భావంతో, స్నేహితంతో మసలతారు.

ఇంక హిందూసంఘం చూద్దాము. అత్తా కోడళ్లు - ఒక సాంప్రదాయమైన, అనుబంధంలాగ తోస్తుంది. అనాదినుంచి, అత్తాకోడళ్ల పొత్తుగురించి, మన సారస్వతంలోకి ఎన్నో సామెతలుకూడా వచ్చాయి - వెటకారానికి. "అత్తాకోడళ్ల" పొత్తుగురించి మాట్లాడుతాం. కోడ లుంటేగాని, 'అత్త' అన్న పదానికి ఎలాగైతే సరైన అర్థంరాదో, అలాగే కోడలుంటేనేగాని 'అత్త' అనే వ్యక్తి కనుపించదు. అన్నట్లు 'ఆకులలమూ' 'అల్లీబిల్లీ' - మొదలైన, జంట మాటలను, వాడుకలో ఎలాగైతే వాడుతామో అలాగే 'అత్తాకోడలు' అని జంటపదం వాడుతాము. అత్తాకోడళ్లలో పొత్తు వుండనీయండి లేకపోనీయండి - 'అత్త' అన్నపదాన్ని 'కోడలన్న పదం అనుసరించి తీరుతుంది. English భాషలో 'Q' అన్న అక్షరం వుంది. Q అన్న అక్షరంతో ఏపదమైన ఏర్పరచండి. 'U' అన్న అక్షరంప్రక్క నుండితీరాల్సి. అందుచేత 'Qu' లాగే అత్తాకోడళ్లు జంటపదాలుగా వాడుకలో వున్నాయి.

ఇంతకీ, అసలుసంగతి మరిచిపోయాను. ఆమాటకొస్తే - అత్తగారు, ఒకింటికోడలే! అత్తగారు కూడా, తాను ఒకింటికోడలన్నమాట మరిచిపోతుంది అత్తగారవగానే! కారణం ఏమంటే, హిందూ కుటుంబంలో అత్తగారు గృహానికి పెద్దకాబట్టి. లేడికళ్లతో బిత్తరిచూపులు చూస్తూ, సప్తపదాలూ, భర్తతో కలసివేసిన అమ్మాయి, ఎనిమిదో అడుగు తన నూతనగృహంలోకి తన నూతనజీవిత వాతావరణంలోకి పెట్టగానే, అంతవరకూ ఆయింటికోడలుగా వుంటూవున్న ఆవిడ అత్తగారై,

"ఏం కోడలా, రా! లోపలికిరా" అని ఆహ్వానిస్తుంది. ఆ నిమిషాన్నే అత్తగారు, తాను కోడలుగావున్న నైజాన్ని, జీవితాన్ని, త్రాచుపాముకూసం విడిచినట్లు వదిలేసి, అత్తగారి తనంతో పెద్దరికం వహిస్తుంది. ఆ సంబంధం మేనరికమే అవనీయండి, ఆ కోడలు మేనకోడలే అవనీయండి, ఆమె కొడుక్కిచ్చి వివాహం కాగానే ఆఅమ్మాయి కోడలైపోతుంది. అంతవరకూ మేనత్తగా వాత్సల్యంతో అనురాగంతో తలనిమురుతూ ముద్దుగా మేనకోడల్ని అపరూపంగా చూసిన మేనత్త అత్తగారైపోయి మేనకోడల్ని వుత్త కోడలుగా చూస్తుంది పూర్వపు చనువు, కనుపించదు. పూర్వపు మంచితనం, కనిపించదు. కోడలి మీద అధికారం చెలాయించగల హక్కు-భుక్తాలతో, చిన్నచూపుతో కోడల్ని చూస్తుంది.

అత్తగారు ఒకింటి కోడలుగా వుండే దినాల్లో ఎలా వుండేవో అలోచించారా! ఆవిడ అత్తగారు ఈవిణ్ణి యిదిచెయ్యి అదిచెయ్యకు, ఇలావుండు అలావుండకు, అనే సూత్రాబద్ధం చేసేది. కోడలుగా వున్నప్పుడు మనస్సు చిక్కబట్టుకొని, స్వేచ్ఛకు స్వస్తి చెప్పుకొని, అణకువతో, మెలకువతో ఈ అత్తగారే కోడలుగా నమ్రతతో నడుచుకొనేది. ఆశలు, కోరికలు, ఉత్సాహం, ఆనందం-ఇత్యాదులు-అణచుకొన్నవి అడుగునే వుండిపోయేవి. ఎందుకంటే అవి అన్ని బహిర్గతంకాని - కోరికలైపోయేవి. తత్ఫలితంగా ఆవిడ జీవితంలో మానసికంగా వొక రకం అసంతృప్తి అభివృద్ధి ఐంది. అటువంటి తీరనికోరికలు, స్థిరపడిన తికమకలు, మొదలైనవి గల మనస్సుతో ఆవిడ ఒకానొక కాలంలో కోడలుగా వున్న ఆవిడ, తర్వాత అత్తగా రౌతుంది. అటువంటి మానసిక, ప్రవృత్తి గల, వ్యక్తికి అత్తగారిపదవి లభిస్తే ఇంక ఐన కోడలు ఎలా తయారవుతుందో మనం వూహించుకోగలం. అవునా! ఎందుకంటే మానవనైజం ఏమిటంటే కుక్క - గడ్డిలోట్టె వంటిది. కుక్క గడ్డితినదు. తినవచ్చిన గొడ్డుని తిననీయదు. అలాగే అత్తగారు కోడలుగా వున్నప్పుడు అత్తగారి సంకుచిత మనఃప్రవృత్తి వల్ల జీవిత వాంఛలను, సంతృప్తి పరుచుకోలేకపోతుంది. తాను అత్తగారవగానే తాను అనుభవించనివి కోడలు ఎందుకు అనుభవించాలనే దుగ్ధచేత బాధపడి కోడలినికూడా చూడక సరిగ్గా తన గత జీవితంలోకి మారుస్తుంది. దానాదీనా ఆకోడళ్లు కూడా అక్షరాలా అత్తగార్లలా తయారవడానికి సావకాశం ఏర్పడుతుంది.

మన దృక్పథంలోనుంచి భర్తని అంటే అత్తగారి కొడుకును కూడా చూద్దాం. ఈ సందర్భంలో శ్రీ విశ్వనాథంవారి 'కిన్నెరసాని,' జ్ఞాపకం వస్తుంది. అవిభక్త హిందూకుటుంబంలో భర్త ఒక చెలియలి కట్టలాంటివాడు. అటు తల్లి మూర్ఖత్వాన్ని భరిస్తూ ఇటు భార్య దీనవదనాన్ని చూస్తూ తమాయించుకోవాలి. నిత్యం కత్తిమీద సాములాంటిది అతనిజీవితం. ఇటు తల్లిమాట కాదనలేడు అటు భార్య ముగ్ధత్వానికి మూర్ఛచెందలేడు.

తానుకూడా ఒకింటి కోడలే అన్నసంగతి అత్తగారు తెలుసుకుంటే ఎంత బాగుండి పోను! అప్పుడు తన కోడలిపట్ల ఎంత సుహృద్భావం, ఎంత వాత్సల్యం, ఎంత ఆపేక్ష! అప్పుడు మన హిందూకుటుంబాలు ఎంత అన్యోన్యంగా వుంటాయో కదా! తాము కూడా తమ అత్తగార్లలానే తయారవుతారని తెలుసుకొన్న కోడళ్లు అత్తగార్లపై ఎక్కువ సానుభూతి చూపడానికి వీలవుతుంది. ఒకప్పుడు నిజంగా అత్తగార్లు మనం అనుకున్నట్లు గాకుండా మామూలుగా వున్నప్పటికీ కోడళ్లు అవిషయం తెలుసుకోలేక పోవడంవల్ల కూడా వారిపై ఆదరణ ప్రేమాతిశయాలు తగ్గుతూంటాయి కూడాను. అంచేత వొకరి పరిస్థితులు ఒకరు బాగా అర్థంచేసుకుంటే వాత్సల్యం అభివృద్ధిఅవడంకాకుండా కుటుంబంలో శాంతి నెలకొల్పిన వారవుతారు.

— A. I. R అనుమతిని,

# నాగపూజ —

వృష్టియని ప్రజలెల్ల
సంబరంబుగ నేడు
నీదర్శనంబునకు
నిలిచి యున్నారయ్య ;
నాగరాజా నీవుమేలుకో ;
నతుల నన్నిటి వేగ తీసుకో !

హరిజనులు ఆశతో
ఆలయంబున దిగిరి
ఆఅమాయకులకు
ఆశీస్సు లీవయ్య ;
నాగరాజా నీవుమేలుకో ;
నతుల నన్నిటి వేగ తీసుకో !

కల్లుగీతలు పోయె
కష్టాలు పెరిగెనని
వగచేటి ప్రజ లరుగో
వారి మొర వినవయ్య ;
నాగరాజా నీవు మేలుకో ;
నతుల నన్నిటి వేగ తీసుకో !

నల్లసంతల పుంత
నడచేటి ప్రజలరుగో
వారి వినయాలకు
వహ్వా ! అనబోకయ్య !
నాగరాజా నీవుమేలుకో ;
నతుల నన్నిటి వేగ తీసుకో !

ధరలు పెరిగిన వంచు
కరువు మీరిన దంచు
కలతపడి నలతపడు
కష్టజీవుల చూడు !
నాగరాజా నీవుమేలుకో ;
నతుల నన్నిటి వేగ తీసుకో !

పాలు పోయంగానె
చాలనక త్రాగుతూ
లంచగొండుల వోలె
మించి నందించకు
నాగరాజా నీవు మేలుకో
నతుల నన్నిటి వేగ తీసుకో !

మడియంచు దడియంచు
మాయ వేషాలతో ;
పరపొత్తు కిట్టనీ
ప్రజలు వచ్చా రరుగో !
నాగరాజా నీవుమేలుకో ;
నతుల నన్నిటి వేగ తీసుకో !

ఈ తెలుగు ప్రజలలో
ఏకభావము నిలుపు
ఏశక్తి నైననూ
యిచ్చితివ ! అదిచాలు ;
నాగరాజా నీవు మేలుకో ;
నతుల నన్నిటి వేగ తీసుకో !

— అయ్యగారి విశ్వేశ్వరరావు.

# సుబ్బి

"నెమలి"

అవి ఎండాకాలపు శెలవులు. నేను కళాశాల మూయగానే మా గ్రామాని కెళ్ళాను. గ్రామంలో మాబంధువులు చాలామంది వున్నారు. వాండ్లలో మంగమ్మ వదినంటే చాలా చనువు. ఆవిడే మాకు చాల దగ్గర చుట్టము కూడాను. మంగమ్మవదినెకు మేమంటే యెంతో యిష్టమే గాని, ఆవిడ ముక్కోపి. ఇంట్లో దాసీ జనమంతా ఆవిడంటే హడలిపోయేవారు. ఏచిన్నపని గాని కాస్త నిర్లక్ష్యంగా చేస్తేసరి ఇక ఆరోజంతా ఆనౌఖరుకు నరకలోకమే స్వర్గలోక మనిపిస్తుంది. కాని మరుసటి రోజే ఆతని చేతిలో ఏదివో పదో ఇనాము పడుతుంది. మంగమ్మవదినెకు నోటి దురుకేగాని, నిజానికి ఆవిడలాంటి మెత్తటి గుండె కలవారు మరొకరు లేరు. ఇలాంటి మంగమ్మవదినెకు సుబ్బి పనికి కుదరడ మామె పూర్వజన్మ పుణ్యఫలమనీ ఏవేవో చెప్పేవారు. అయితే మంగమ్మవదినెకు సుబ్బి అంటే మొదట్నుంచె ఇష్టం లేదు. ఎలాగయినా దీనిమీద నింద మోపాలని ప్రయత్నించేది. వదినెకు సుబ్బి మీద యెందు కింత పంతమో నాకర్థ మయ్యేది కాదు. సుబ్బిని నానాకష్టాలు పెట్టి మూడుచెరువుల నీళ్ళూ త్రాగించేది కాని సుబ్బి తనపనేదో చూచు కొని వేరుజోలికి పోనందుచేత వదినెకు తనపట్టు నెరవేరలేదు

ఒకనాటి సాయంకాలము నేను, నాన్నతో పొలాల మీదుగా వెళ్ళాను. చీకటి పడినా, నాన్నగారి పని పూర్తి కాకపోవటంచేత నేను తిరిగి యింటివైపు దారితీశాను. ఇంతలోకి మంగమ్మవదినెను చూడా లనిపించింది. వెంటనే ఆమె యింటికి వెళ్ళాను. ఇల్లంతా ఒకటే గందరగోళం. బంట్రోతులందరూ కాలు గాలిన పిల్లుల్లాగ ఇటూ అటూ తిరుగుత్తూ వున్నారు. ఒకగదినుండి, వదినెకేకలు వెయ్యడం, సుబ్బియేడుపూ వినబడింది. గబగబా ఆగదివైపు వెళ్ళాను. వదినె యిలా అనడం నాకు వినిపించింది. "ఛీ దుష్టురాలా! ఇన్నాళ్లు జిత్తులమారి నక్కలాగా అందరినీ యేమరిపించావు. ఇప్పుడు బయట పడ్డది నీగుట్టంతా; ఎంతో అమాయకురాలిలాగ నటించి తప్పించుకుందా మనుకున్నావూ? నాదగ్గరటువంటి ఆటలేవీ పనికిరావు. జాగ్రత్త! కన్నూ మిన్నూ తెలియక చంటిబిడ్డ చెవులు గరుక్కు పోయి రక్తం వస్తూవున్నా పోగులు లాక్కున్నావే, ఎటువంటిదానివే నువ్వు? పైగా అబద్ధాలు చెప్తావే? ఉండు నీపని చూద్దాం" అని కోపం పట్టలేక మాటల నాపివేసింది. ఇంతలో సుబ్బి "అమ్మగోరూ, నాకూ యింటికాడ చంటిబిడ్డవుంది, నేనా పని చేస్తానమ్మా? నాపేణం పోయినా చంటిబిడ్డకు గోరుతగలకుండా కాస్తానే అమ్మా? నేను బిడ్డపోగులు తియ్యలేదమ్మగోరూ, మాకోటప్ప సాచ్చిగా చెప్తోండాను. చిన్నమ్మ చెవులోపోగులు, తోటలో చెట్టుకొమ్మ గుచ్చుకొని విరిగి రత్తం వచ్చిందంటే నమ్మరు. తుడిచి మందుపెట్టి చూస్తే కిందబడినవి కానలేదమ్మా. ఇంటికాడ బిడ్డ పేణం పొయ్యేలాగుంటే నేనాపని చేస్తానమ్మా?" అని గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ చెప్పింది. వదినె "ఛీ భడవా! నోరుముయ్యి! చంటిబిడ్డట, దయాదాక్షిణ్యమట! అహ్హా! ఇలాంటి జిత్తులమారివాళ్ళకా వుండాలి! వాటినమ్మి బిడ్డకు మందు కొనుక్కుందా మనుకున్నావేమో? ఇప్పుడే కానిస్టేబిల్‌ను పిలిపిస్తా నుండు" అని కసరుకొంది.

అంతా తలుపుదగ్గర నుంచొని చూస్తూన్న నేను "వదినా ఏంజరిగింది!" అని అడిగాను. నావైపు తిరిగినారు యిద్దరున్నూ. సుబ్బి సిగ్గుతో దుఃఖంతో తల వంచేసుకుంది. సుబ్బిని మొదట వదినెయింటికి పంపినదాన్ని నేనేగా మరి! వదినేమో "ఏంజరిగిం దేమిటి? అదుగో మిటకరిస్తూవున్న నీబంగారంలాంటిసుబ్బి నడుగు, చెబుతుంది కథంతాను. నీమాటవిని, ఏమో అనుకుని నాతలమీదికే తెచ్చుకున్నాను. కాస్సేపు గుడికెళ్ళొస్తా, అమ్మాయిని చూసుకోమని చెబితే, అప్పుడే యింట్లోపిల్లకి బాగులేదని ఏదో వంకబెట్టింది. వీల్లేదని నేను వెళ్ళివచ్చేసరికి జరిగిన సంగతి యిదీ!" అని నన్ను కోప్పడ్డది. నాకు వదినె చెప్పినమాటల్లో కించిత్తయినా నమ్మకంలేదు. ఏదో పొరబాటు జరిగివుంటుం దనుకున్నాను.

“వదినా! నువ్వుచేసేదేమీ బాగులేదు. ముందూ వెనుకా ఆలోచించకుండా యిలా దాన్ని చీవాట్లు పెట్టకు. నీబంగారు తీసుకుపోయి ఎక్కడమ్మ కొంటుంది! ఈ వూళ్ళో సుబ్బి నెరగనివాళ్లున్నారా? నువ్వేదో పొరబాటుపడుంటావు. నేను సుబ్బిని విచారించి నిజం కనుక్కుంటానులే, నువ్వు తొందరపడకని” సుబ్బివైపు తిరిగి, “సుబ్బీ! నువ్విలారా, నీయింటివరకూ నేనూవస్తాను” అని చెప్పాను. వదినె మారు మాటాడేలోపల, దానితోబాటు బయటపడ్డాను.

కొంచెందూర మిద్దర మేమీ మాట్లాడకుండా నడిచాము. తరువాత నేనే యిలా మొదలెట్టాను. “సుబ్బీ నీపిల్ల కిప్పుడెలా వుందే? డాక్టరుగారేమని చెప్పా”రని అడిగాను. సుబ్బి యేడుస్తూ “ఏమి చెప్తారమ్మా, ‘పేణంపోతుంది, యింజక్ష నివ్వకపోతే’ అన్నారు. ఆయింజక్షనికి పదిరూపాయలుయియ్యాలట, నేనేడికి పొయ్యేదమ్మా, పదిరూపాయలకి? మా బావతో చెప్తె, అయితే వాడు మాత్రం యాడికిపోతాడు? నాఅద్దుష్టం! పిల్లోడు నూతిలోపడ్డాడు. ఇప్పుడు పిల్ల పోతావుండాది. కడాన, యేదో దగ్గరుంటారుగదా అని మనమ్మగోరు నడిగితే యీల్లేదు పొమ్మన్నారు. ఇంతట్లో ఈ యాపత్తు వచ్చిందమ్మా” అని వెక్కి వెక్కి ఏడవసాగింది. దాన్ని ఓదారుస్తూ “ఏడవకే సుబ్బీ, నేనిప్పుడేవెళ్లి డాక్టరుగారిని పిలుచుకొస్తాను. అంతవరకూ నీవు పిల్లదగ్గిరే వుండు” అని చెబుతూండగానే దాని గుడిసెవచ్చింది. లోపలికెళ్లాను. నాకండ్లు నమ్మలేకపొయ్యాయి ఎంత శుభ్రంగావుందా పూరిగుడిసె! నేలంతా అలికి చక్కని ముగ్గువేసి వున్నది. ఒకమూల శుభ్రంగా తోమిన కుండలుకొన్ని బోర్లించియున్నవి. ఇంకోమూల నులకమంచంపైని ఓచిన్న శరీరం కనబడుతూవుంది. పుల్లలాంటి కాళ్లూ, చేతులూ, పాలిపోయిన ఆమొహమూ చూస్తే నాకు కండ్లలో నీళ్లు తిరిగాయి. అవునా చిక్కి శల్యమైనశరీరమే సుబ్బిబిడ్డ. సుబ్బిరాగానే కళ్లువిప్పి “అమ్మా! అని హీనస్వరముతో పలికిందాఅమ్మాయి. సుబ్బి పరుగెత్తుకుంటూ వెళ్లి, మంచంప్రక్కన చతికిలబడి, చిన్నపిల్ల తలనిమురుతూ వెక్కి వెక్కి ఏడుస్తూవుంది. ఇక ఆదృశ్యం చూడలేక, గుడిసె విడిచిపెట్టి డాక్టరుగారింటికి వెళ్లాను. డాక్టరుతో జరిగిన సంగతంతాచెప్పి యింజెక్షను తీసుకురమ్మన్నాను.

మేము సుబ్బి గుడిసెచేరేసరికి, అది చిన్నప్రమిదలో ఆముదపువత్తి ముట్టించి యేదో వండుకుంటూ వుంది. డాక్టరుగారిని చూడంగానే దానిమొహంలో ఆనందరేఖలు కనబడ్డాయి. తనబిడ్డ తనకు దక్కుతుందన్న సంతోషంతో మైమరచి, ఓబొమ్మలాగ నిలబడింది. డాక్టరు పిల్లనుజూచి యింజెక్షనిచ్చి, కొద్దిరోజులలో బాగౌతుందని చెప్పారు. నేను “యింజక్షను ఖరీదేమీ లేకుండా యిచ్చారుగదా డాక్టరుగారూ?” అని చెప్పి సైగజేస్తూ నవ్వాను. సుబ్బి భయపడకూడదనే వూహతో డాక్టరుగారు కూడా అవునన్నారు. తరువాత యింటికివెళ్ళేముందు యింజెక్షనుఖరీదు యిరవైరూపాయలని డాక్టరుచెప్పగా 20రూ నాపర్సునుండి తీసియిచ్చాను. నేను తిరిగి గుడిసెలోనికి వెళ్ళాను. సుబ్బి మంచంప్రక్కన కూర్చొనుంది. నేను “సుబ్బీ, నువ్వు పాపాయి పోగులుతీశావా?” అని అడిగాను. కన్నీరు తుడుచుకుంటూ, కాళ్ళమీద పడబోయింది. దాన్నాపుచేసి ఒకనిట్టూర్పు విడిచాను. అబ్బ! సుబ్బికూడా యిటువంటిపని చేసిందా? నామనస్సులోని కష్టాన్ని వూహించుకున్న సుబ్బి ఏడుస్తూ, “అమ్మా మీరే ఆలోచించండి. నాబిడ్డ పోతూవుండె; ఒక పదిరూపాయలతో బిడ్డబతుకుతుంది. ఎవ్వరులేక, మెల్లగా అవి తీశాను. పాపం చిన్నమ్మ నొప్పితో ఏడిసింది. ఎట్లో గుండె రాయిచేసుకుని నాబిడ్డను తల్చుకొని తీశాను. పెద్దతప్పుచేశాను, నన్ను మన్నించండమ్మా” అంటూ రెండు బంగారపు పోగులు తనఒడిలోనుంచి తీసియిచ్చింది. నేను వాటిని చేతిలో పట్టుకుని పిచ్చిదానిలాగ నిలబడ్డాను. సుబ్బి తలవంచుకుని ఏడుస్తూనేవుంది. మెల్లగా దాన్ని ఓదార్చాను. మాటికి తెరువులేని ఆనిరుపేదను చూస్తూవుంటే నామనస్సు కరగిపోయింది. దానిచేతులు పట్టుకుని, “సుబ్బీ నీవిలాంటిపని యింకెప్పుడూ చేయవద్దు నీకు సహాయం కావలిస్తే నన్నడుగు. ఇప్పుడు వదినెతో “ఇవి నాకు తోటలో దొరికాయని చెప్తాను. పొద్దున్నే నీవువెళ్ళి చేసిందంతా చెప్పకో. వదినె నిన్ను మన్నిస్తారు.

నేను వెళ్ళుతున్నా" నని చెప్పి మావదినింటికి వెళ్ళి తలుపు తట్టాను. వదినే తలుపుతీసింది. ఆమెచేతికి పొగులిచ్చి, నేను తిరిగి మాయింటికి వెళ్ళాను. అప్పటికి రాత్రి పదకొండయింది. గుండెలు తటతటా కొట్టుకుంటున్నాయి నాన్నారు కోప్పడితే ఏంబదులు చెప్పుదామని, అందులో పొద్దున బండికి టిక్కట్టు కోసమిచ్చిన యిరవైరూపాయలు డాక్టరు కిచ్చివేశాను, ఎలాగ?

ఇంట్లో అడుగు పెట్టంగానే ఎదురయింది నాన్నారే! "అర్ధరాత్రి వేళయింది. ఇంకా పడుకోలేదూ? వెళ్ళి భోంచేసి పడుకో" అన్నారు. కాళ్ళుకడుగుకొని భోంచేసి వసారాలోకి వచ్చాను. అక్కడ నాన్నా రెవరితోనో మాట్లాడుతున్నారు నన్ను చూడంగానే, "వీరేనమ్మా మనవూరి డాక్టరు గారు" అని చూపించారా ముసలాయన్ని. అవును సుబ్బిపిల్లకు యింజెక్షనిచ్చిన డాక్టరే! నాకేమీ పాలుపోలేదు. ఎలా తప్పించుకొందామా అని ఆలోచిస్తున్నాను. ఇంతలో నాన్నారు, యిరవైరూపాయల నోట్లు తీసిచ్చారు. "ఏమమ్మా, రేపు పట్టణానికి టిక్కట్టులేకుండానే పోదామనుకున్నావా?" అన్నారు నాకప్పు డర్థమయిం దంతానూ. బ్రతికాంరా బాబో యంటూ యివతలకి వచ్చేశాను!

# దేవీ సూక్తం

[ఇది ఋగ్వేదాంతర్గతం. అథర్వణ వేదంలో కూడా ఆవృత్తమైంది. అంభృణ మహర్షి దుహిత వాగ్దేవి ఈ సూక్తానికి ఆవిష్కారిణి. ఇందులో ఆవిడ తన సాక్షాత్కారాన్ని వర్ణించింది. గ్రీక్ - తత్త్వశాస్త్రంలో వర్ణింపబడ్డ "లాగస్" అనే తత్త్వానికి ఈసూక్తమే ప్రాతిపదిక అని కొందరి అభిప్రాయం కాని, ప్రస్తుతం ఈ మంత్రాలుమన దేశంలో సర్వత్రా దేవీపూజలో పఠింప బడుతున్నాయి. మూలాని కిది యథాతథమైన సరళానువాదం. సాయనభాష్యం ఆలంబనం.]

**1**

సంచరింతు రుద్రవసువేషమున నేను,
ద్వాదశాదిత్య విశ్వదేవతలు నేనె,
నేనె మిత్రావరుణులకు నిత్తురూపు,
అశ్వినీ దేవతలయందు నట్లె నిల్తు,
ఇంద్రుఁ డగ్నియు విభవంబు లెన్న నాకు.

**2**

సోమరూపంబు నేను దాల్చి విహరింతు,
నటులనే త్వష్ట పూష భగాదు లగుదు,
హవ్యవిధుల నర్చయొనరించు యాజకునకు,
సోమయాజికి ఫలమిత్తు సొంపుగాను.

**3**

నేనె జగదధీశ్వరిని, నేనిత్తు ధన ము
పాసకులకు, నెఱిగితి నా బ్రహ్మతత్త్వ
మిపుడు, దేవతలందు నే మేటి నగుదు
వివిధ రూపములగొని యీ విశ్వమగుదు,
వివిధ దేశముల వివిధ విధుల నేనె
పూజలను సేవలనుఁగొందు పుడమిలోన.

**4**

అన్నమును నేనె దినిపింతు నందరకును
ఇంద్రియంబుల నడపింతు హృదయమ్మందు
వెలసి, ఇట్లెరుఁగని వాఁ డవిద్య దాట
లేడు, సఖయ నీవు శ్రద్ధతోడ వినుము.

**5**

దివ్యులును మానవులు నెంతో తెలియఁగోరు
బ్రహ్మతత్త్వ మే నెరిఁగియె పల్కుచుంటి
నేను రక్షింపఁ బూనిన మానవుండు
జనులలో శ్రేష్ఠుఁడై ఋషి సంజ్ఞ నందు
అటులె మేధతోఁగూడ బ్రహ్మమగునెంచ.

**6**

నేనె రుద్రధనస్సును నెక్కు పెట్టి
విడతు బాణము బ్రహ్మవిద్వేషి జంప;
జనుల కొర కొనరింతు నే సంగరంబు,
భూర్జవంబుల వ్యాపించి యుందు నేను.

**7**

లోకమూర్ధమై రొప్పెడి నాకసంబు
నాదు సృష్టి; సముద్రమే నాకు యోని,
విశ్వ భువనములను నిండి విదితమైన
నాకభూములఁ గూడ నేఁదాకుచుందు.

**8**

విశ్వభువనములను నేస్వేచ్ఛతోడ
సృష్టిఁజేసితి; పవమానురీతి నిండి
యుండు సర్వంబు: కాని నేనుండు భువికి
దివికి నూర్ధ్వమై తనరెడి దేశమందు
ఎల్ల నామహిమవలన నిట్లు జరుగు.

శ్రీ నిర్వికల్పానందస్వామి.

(గతసంచిక తరువాయి)

ధర్మమెరుగు తన తనయుని
దుర్మార్గ మెరుంగు విజయు దోర్బలమెరుగున్
నిర్మలి కృష్ణుండే! జని
ధర్మంబగు రీతిదెల్పదా యేమనునో.

సాత్యవతేయ నందనుఁడు సత్యము ధర్మము వీడి పుత్రుడే
నిత్యమటంచు నెంచికొని నీతియు రీతియు ధర్మబద్ధమున్
సత్యముగా జగంబులకు సమ్మతిగా విభుదాళికెల్ల సం
స్తుత్యముగా వచించు హరి సూనృతవాక్యము పారదోలునే.

మఱచియున్నె మున్న జరిగిన మాట లా
మానధనుఁడు దురభిమాన ఘనుఁడు
ఘోషయాత్ర తెఱఁగు గోగ్రహణమునాఁటి
పరుగు సవ్యసాచి శరము మెఱుగ.

నాఁడటు పాండవాత్మజులు నన్నును, తమ్మును రాజ్యమెల్లఁ దా
నోడి మహార్తి నున్నతరి నుద్యతులై ధృతరాష్ట్రి నందనున్
పాడి దొఱంగి వల్వలొలువన్ గని సూతసుతుండు కొల్వులో
నాడిన వేడిమాట లకటా తలపోయ మనంబు వ్రయ్యదే.

కులసతినని మదిదలఁపక
తులువ ననున్ కులటననుచుఁ దూలగనాడన్
దెలియరె భీష్మాదులునే
కులటనో, కులసతినో పలుకకుండిరి వారల్.

మున్ను నన్నోడిరో! తమ్ము మొదటనోడి
యవల నన్నోడిరో! దెల్పుఁడన్న నందుఁ
గల మహామహు లెవ్వరుఁ బలుకరైరి
పలికె నొక్క వికర్ణుఁ డా కొలువునందు.

ఒక్క వికర్ణుఁడు దక్కగ
నక్కజమౌఁ బలుకరైరి యక్కురుసభలో
నొక్కని మాట జగంబున
కెక్కునె ధర్మార్థ కలితమే యగునైనన్.

కురుపతి భీష్ముఁడుఁ గృపుఁడు కుంభజ ముఖ్యులుగల్గు కొల్వులో
నరసి వచింపరైరకట యాఁడుది వేడిన ధర్మ సంశయం
బెరుఁగరె ధర్మ శాస్త్రముల నేటికిఁ గాల్పనె పెద్దవార లం
దురు గద యేటి పెద్దలిఁక నేటికి వారల గౌరవింపఁగన్

ఇది ధర్మ మిది యధర్మం
బిది తగు నిది తగదటంచు నెవ్వరయేనిన్
బదులీయరైరి కురుసభ
నది సభయే! ధర్మమింత యారయవలదే.

ఆడుదానయ్యు నడిగితి నొకధర్మ
సంశయంబు చెప్పఁజాలరైరి
ధర్మవేత్తలనుచుఁ దనరారు భీష్మాదు
లూరకుంటకాదొ నారకంబు.

ఇది ధర్మ మిది యధర్మం
బిదవిద్ధమటంచుఁ జూపి యేర్పరుపని కో
విదులకు సత్యము సెప్పని
చదురులకున్ బాపకూప సంగతిలేదో.

వనితన్ నిండు సభాస్థలంబునను వల్వల్ విప్పుచో గౌరవుల్
ధనురాచార్యుఁడు భీష్ముఁడాదియవు పెద్దల్ లేరె? పాపంబు పం
డిన రారాజు సభాస్థలంబునను లేఁడే! యొక్కరుండైన నీ
తిని, శాస్త్రంబును, ధర్మ సూక్ష్మ విదులన్ దెల్పంగ నానాఁటికిన్.

ఆడుదాని కూయి నాలకూయినివిన్న
నాదరింపవలె నటంద్రు బుధులు
భీష్ముఁడాదిగాఁగ పెద్దలుగల సభ
బదులురాదు నాదు పలుకునకును.

(సశేషము)

# చీకటి వెల్గులు

శ్రీమతి వి. సుశీలాదేవిగారు

అది ప్రభాతసమయం. వర్షఋతువు. అప్పటికి కొన్నిరోజులనుంచి దట్టముగా అలముకొని పెళపెళా ర్భాటాలతో తమశక్తిని జూపి ఆనాడాకాశాన్ని ఒదిలాయి కాలమేఘాలు.

అది ఒక పెద్దకాలువ గట్టగుటచేతను, వర్షము కురియుటచేతను, కాలువమీదనుంచి వచ్చే పిల్లతెమ్మెరలకు తోడు వర్షమూలమైన చల్లటి తడిగాలి మరింత సహాయపడి వచ్చేపోయే బాటసారులనే గాక చెట్లమీది పక్షులను సహితము ఒణికించుచున్నవి. వాటిబాధ నివారణ సేయుటకో యన అప్పుడప్పుడే జలజప్రియుడు తన కిరణములను వృక్షాలమీదనుంచి, చిన్నిచెట్లు కోమలమైన ఆకుల మాటినుంచి, చిందరవందరగా కాంతిని ప్రజ్వరిల్లచేయుచున్నాడు. అప్పటికి చలిబాధ పోయి ప్రాణాలు కుదుటపడిన పక్షిరాజములు తమ తమ గూళ్ళనుండి వెలువడి వాతావరణముచూడ వాని శరీరములు పులకరించినవో యన తమ శ్రావ్యమైన కంఠములనెత్తి మనోహరముగా కూయసాగినవి.

ఆ కాలువగట్టున ఆరోజు ఉదయం ఒక స్త్రీమూర్తి చలితో గజగజ ఒణికి ముడుచుకొనిపోయిన శరీరంతో, చంకని అయిదేండ్ల వయస్సుగల్గిన బాలిక వణకుచు చేతనొక చిన్నపెట్టెతో దీర్ఘప్రయాణము చేయుచున్నటుల నడవలేక నడవలేక నడుస్తూ ఎందుకో మధ్య మధ్య దీర్ఘనిట్టూర్పులు పుచ్చుత్తు పయనము చేస్తోంది.

ఆమెముఖము శుష్కించి యున్నను మసిపాతచుట్టున్న మాణిక్యమువలె వెలుగొందుతూంది. ఆయువతి కట్టిన ప్రాత చీర మాసి పేలికలై ఆమె దరిద్రదేవత ముద్దుబిడ్డయని నిరూపిస్తోంది. ఆయమ శిరోజము లెన్నడూ తైలసంస్కారము నెరుగనటుల జడలు గట్టియున్నవి. చూడ చూడ ఆ జవ్వని నడి వయస్సులో నుండియూ బ్రతికి చెడిన ప్రాణియని యేదో తీరని వ్యధతో బాధపడుతోందని తోచక మానదు.

ఆమె చంకనున్న బాలికకూడా అదే స్థితిలోనుండి ఆహారము లేమి శుష్కించిన దేహముతో ఖల్లివలె చలిబాధ కాగలేక కప్పుకునే గుడ్డలేక కుంచించుకుపోయి తల్లిని అంటిపెట్టుకుంది.

అంతశ్శోకమును బాహ్యోపచారములు మాన్పజాలవు. చక్కని చెట్లు, చల్లని జలములు, పక్షుల పాటలు శరీరమునకు సౌఖ్య మొసంగును గాని శోకాగ్నిచే మరుగుచున్న మనస్సుకు శాంతి నొసంగజాలవు. మనుజుడు చింతాక్రాంతు డగునపుడు నిముసములు గడియలై, గడియలు జాములై, నిశలు దీర్ఘములై తోచు దుఃఖమును మించిన నరకము మానవునకు లేదు.

అట్లే ఆ అభాగ్యురాలికికూడా ఆ పిల్ల తెమ్మెరలు ఆ కోవెల కూతలు అవేవీ శాంతినివ్వక పోగా యెంతదూరము పోయినా మార్గము తరుగుటలేదు.

క్రమేణా ఆయమ కాళ్లు చచ్చులు పడ్డాయిగాబోలు; పాప మొకచెట్టుక్రింద బిడ్డని దింపి పెట్టె నేలబెట్టి ఉస్సురంచూ చతికిల పడిం దానిర్భాగ్యురాలు.

ఆ అభాగిని కంటివెంట కారే బాష్పధారలు కడచిన దినములలో పడిన వర్షధారలను మరపించినవి. ఆ బాధతో కన్న బిడ్డను గుండెకు హత్తుకొని విలపింప సాగినది.

కష్టసుఖము లేమిటో, ప్రపంచమున నేమిటో యెరుగని ఆ చిన్నబాలిక తల్లి ముఖమును తెల్లబోయి చూస్తూ ఆ చిన్న చేతులతో మాతృమూర్తి కంటినీరు తుడుస్తూ, వచ్చీరాని ముద్దులొల్కు పలుకులతో,

"అమ్మా! ఎందుకే యేడుస్తావు? నాతో చెప్పవే!" అంది. ఆ పసిబాలిక మాటలు మరింత హృదయమును కలచివేయ బిడ్డను గాఢముగా గుండెకు హత్తుకొని ఓదారుస్తు "లేదమ్మా చిట్టి, నే యేడవటం లేదులే; పిచ్చితల్లి నీ ముద్దుపల్కులు వినేందుకుకూడా మీ నాయన నోచుకోలేదు గదా?"

"అమ్మా! మరేం; నాన్న యెక్కడికి కెళ్లారే? ఎప్పుడొస్తారూ? నన్నెత్తుకుంటారుటే?"

"వస్తారమ్మా చిట్టి, నిన్నెత్తుకుంటారు."

"ఎప్పుడేమిటి? యెప్పుడూ వస్తారు, వస్తారంటావు, గాని రానే రారు"

అనే బిడ్డపల్కులు మరింత దుఃఖాన్ని కల్గించగా "కన్నతల్లీ వస్తారమ్మా! నా అదృష్టము బాగు లేకపోయినా నీవైనా అదృష్టవంతురాలివి కాకపోయావు గదా?"

"అమ్మా! నన్నెత్తుకుంటే నీచేయి నొప్పెత్తిందా? పోనీలే నడుస్తానులేవే" అని మరింత తల్లిని బ్రతిమాలసాగిందా బాలిక.

నా చిట్టితల్లీ లేదులే. అమ్మా, పోదాంపద, అంటూ కారే కన్నీరు తుడుచుకుని బిడ్డను లేవదీసి చెట్టె పట్టుకు బయలుదేరిం దాశోకదేవత.

ఆలా యెక్కడికో! ఎంతదూరమో గమ్యస్థానం? వెన్నెల తరువాత చీకటి తప్పదు.

♦ ♦ ♦

చీకటి తరువాత వెన్నెల. కష్టము తరువాత సుఖము సహజము గదా! అట్లే సృష్టికి మార్పు సహజము.

ఒకానొకప్పుడు ఆ కుటుంబముకూడా ప్రపంచ మానవ దృష్టిలో అత్యుత్తమ స్థానాన్ని అలంకరించియుండేది. వారు లక్ష్మీపుత్రులై యుండే రోజులలో నిరాడంబర జీవితాన్ని సాగిస్తూ ఈ కృత్రిమ ప్రపంచ దృష్టిలో గౌరవముగా చూడబడినవారే. ఈ ధన సంపదలు నీటిబుగ్గ వంటివి. ఈ జీవితం క్షణ భంగురము. విధి విలాసం వారి సంపదలను గాలి మేఘాల్లాగా మాయం చేసింది. దానితో, మూలిగే నక్కమీద తాటిపండు పడ్డటుల, భర్త మనస్సు చెదరిపోయి దేశాల పాలైనాడు. ఇక మిగిలిన అయిదేండ్ల నోరు వాయీలేని పసిబాలిక, తాను, తినుటకు పట్టెడన్నము లేక శరీరము కప్పుటకు సరియైన గుడ్డలేక అల్లాడారు. "ధన మూల మిదం జగత్" అనివారు భాగ్యవంతులైన రోజులలో అందరూ బంధువులే; అందరూ మిత్రులే, ఎన్నడూ యెరుగనివారుకూడా ఆ యింటిలో ఆతిథ్యమును స్వీకరించనివారు లేరంటే, నమ్ముతారా?

ఇట్టి బంధువులే యిప్పుడా మాతా సుతల "నేలినాటి శని" అన్నారు పొట్టలు విచ్చేలాగు తిని 'బ్రేవు'మని త్రేన్చి, "మీ వాత్సల్యము మరువలేమని" వంగి వంగి సలాములుచేస్తూ నక్క వినయాలు చూపించిన మిత్రులే ఈనాడు "ఎవరుమీరు" అన్నారు. అంతదూరమెందుకు? ఆమె కన్నతల్లి, తోడబుట్టిన తోడులే "నీ కెవరు పెడతారు నీ మగడెచ్చట నుంటే అచ్చటికే పో"మ్మని మూడేసి రోజులు తిండిపెట్టక ఉపోషాలు చేయించారు. అందరకూ బానిసవలె చాకిరీ చేయుట, యెదురు వారిచే మాటలు పడుట, కన్నతల్లి దగ్గరనుండి, చిన్న తమ్ముడివరకూ దూషించేవారే.

ఆహా! దరిద్రదేవత యెంత భయంకరమైనది. భర్తృహీన బ్రతుకెంత దుర్భరము?

అట్టి జీవిత నరకాన్ని అనుభవించలేక ఆ దురదృష్టవంతురాలు అనేకమారులు తన తుచ్ఛ శరీరమును గంగార్పితం చేయ దలచికూడా, ఈ బాలికను తను కడుపార నవమాసములు మోసి కని పెంచిన బిడ్డను నోరులేని పసిపాపను వీడలేక విరమించేది. తనంత కష్టపడి పనిచేస్తేనే పట్టెడు మెతుకులను జానెడు

గుడ్డకు పెట్టి పుట్టని పుట్టినింట, తన బిడ్డను, పని పాటలు నేర్వని పసిపాపను, వారు ఆదరించి చూస్తారా? అనే ప్రశ్న ఆమె హృదయాన్ని కలచివేసేది.

ప్రేమ సిద్ధాంతాన్ని పాటించటానికి దైవ నిర్మితమైనది మాతృమూర్తి అట్టి స్థితిలో ఆ తల్లి ప్రేమ తాండవించింది. ధైర్యము తెచ్చుకుని తనలో తానే ఆలోచించుకునేది.

"ఛా! చచ్చి యెవరిని సాధించుట" బ్రతికియుంటేనే యెవరైనా కష్టముల విలువ కనిపెట్టుట. మనకంటే కష్టములపాలై తినటానికి తిండిలేక కట్ట బట్టలేక చెట్టునీడే ఆశ్రయముగా గాలియే ఆధారముగా బ్రతికేవా రెందరులేరు. వారందరూ చావలేకే బ్రతకగల్గుచున్నారా? అట్టి వారందరికన్న నేనెక్కువా? వెన్నెల రోజులన్నీ వేడుకగా వెళ్ళబుచ్చి చీకటి రోజులని చికాకుతో గడుపుట మానామా? అలాగే సుఖ దినములు సంతోషముగా గడిపి యిప్పుడు కష్టము వచ్చేసరికి ఆత్మహత్యకు పాల్పడుట యెంత యేహ్యమైన పని! కష్ట సుఖములు కలకాలము కాపురములుండునా! అటులే దైవము నా పతిని నాకు కూర్పరాదా!" అనే ఆశా పాశమే ఆమెను యీ దుఃఖ ప్రపంచములోకూడా బంధించివేసింది. అనాడే ఆ అభాగిని భర్త్రాన్వేషణకై పల్లెలనక పట్నములనక, ఎండనక వాననక, కాలి నడకను కన్నబిడ్డతో కడుపునకు కూడులేక, తిరిగినచోట తిరగక, పరుండినచోట పరుండక తిరుగుతోందా యిల్లాలు!

భగవానుడామె పట్టుదలకు, కష్టాలకు మెచ్చుకొన్నాడో. ఏమో!—అన్నటుల ఆమె కష్టములు గట్టెక్కినవి ఆమె కోర్కెలు ఈడేరినవి. ఆమెభయము పోయింది. ఆమె భర్త ఆమెను తిరిగి లభించాడు. ఆమె యిపుడు భర్తగల భార్య అయింది. అదే సుదినము. అదే ఆనందము.

♦ ♦ ♦

## 15 సంవత్సరముల పిమ్మట

ఇప్పుడు వారు కూటికి గుడ్డకూ లోటులేని శ్రీమంతులు. ఇదివరకు తిరస్కరించిన సంఘమే యిప్పుడు వారిని గౌరవిస్తోంది. మర్యాద చేస్తోంది. ఇదివరకల్లా దూషించి దూర దూరముగా తొలగిన బంధు మిత్రులే యిప్పుడు దగ్గరకు చేరసాగారు. ఏనాడో మరచిన ఆ నిర్భాగ్యమూర్తి పేరు లక్ష్మి. ఇప్పుడామె ముఖము కలకలలాడుతూ లక్ష్మి స్వరూపమువలె నుంటుంది. ఆ ప్రాత పేలికల స్థానముననే నూతన వస్త్రము లేర్పడినవి. ఆమె ఆనాడు సంతత దుఃఖముతో కార్చిన కన్నీరే యీనా డానంద బాష్పాలుగా మారాయి.

ఆనాడు తిండిలేక రొండిన ఆ అయిదేండ్ల పసిబాలికే యీనా డిరువదియేండ్ల కన్యయై ప్రియ భర్తతో సంసార యాత్ర నిర్వహిస్తోంది. ఇప్పుడామె మాతా పితలకేకైక బాలికయగు ముద్దుబిడ్డ. ఇప్పుడు వారికి కష్ట సుఖములు లేవు రెంటినీ సమాన భాగముతో ననుభవించే శక్తిగల సంతృప్త హృదయులు వారు. వారి కీవిశ్వములో మిత్రులూ లేరు. శత్రువులు లేరు. అట్టివారి జీవిత నౌకలు ఈ ప్రపంచమనే అగాధములోబడి ఒడుదుడుకులు లేకుండా సంసార సముద్రాన సాగిపోతున్నవి.

ఇప్పుడు వారి జీవితాలలో చీకటుల చీల్చుకుని వెన్నెలలు ప్రవేశించినవి.

అట్లే కష్ట సుఖములు కావడి కుండలు.

# పతాకం!!!

ఈ విశాల లోకంలో
వినికని ఎరుంగని
సామ్రాజ్య విదాహంలో
స్వాతంత్ర సమరాల్లో
రాగద్వేషం లేని
రక్తపు బొట్టు లేని
శాంతి సమరమే చేసి
స్వాతంత్ర్యం సాధించాం!

* * *

శతాబ్దాల - తరబడి నీ
పరపీడిత - భరతజాతి
శృంఖలాలు - సడలించి
స్వేచ్ఛాదానం చేసిన
స్వతంత్ర పతాకం;
విజయపతాకం
వచ్చినది; వచ్చినది.
త్రివర్ణ శోభిత
దివ్యపతాకం
వెలసినది.

* * *

ప్రపంచశాంతికి
ప్రపంచ స్వేచ్ఛకు
పరమోన్నత
ఆదర్శాలను
ప్రదర్శించే
పవిత్రపతాకం!
అదిగో! ఆకాశపథంలో.

* * *

యుగాలక్రితమే
ఆర్యావర్తం
ఆర్జించిన
ఆర్షవిజ్ఞానం
పరిపాలన
తనపాదాలతో
మట్టేసిన
నాగరికత
పునర్జీవితం
చేసేయోగ్యత
పునఃప్రకాశం
పొందేయోగ్యత
కలిగించే
కళలపతాకం
ఎగిరింది! ఎగిరింది.
మనభరతమాతృ
దేశములో
ఎగిరింది! ఎగిరింది!
కోట్లకొలదీ
కాలేకడుపుల
ఆకలి బాధను
అణచే శక్తిని
వేలకొలదీ
వేదనమొదడులు
కళావికాసం
పొందేఅర్హత
ప్రసాదించెడి దివ్యపతాకం!

* * *

పీతహారిత
శ్వేతకాంతులు
ధర్మచక్రముతో
దీప్తినింపుతూ
అదిగో ఆకాశపథంలో
జాతీయపతాకం!
స్వతంత్రభారత
స్వర్ణపతాకం!
త్రివర్ణశోభిత దివ్యపతాకం!

—శ్రీ రాజ్యలక్ష్మీదేవి.



# తీర్థములు

శ్రీమతి జాస్తి తులశమ్మగారు

మనలో తీర్థముల పేరు విననివారెవరు నుండరు. అంతియగాక మేము తీర్థ యాత్రలకు వెళ్ళివచ్చితిమి. మా పాపములన్నియు నశించినవి. మేము పవిత్రుల మైతిమని భావించువారుగూడ పెక్కురున్నారు. కాని యదార్థముగా తీర్థమన నేమియో మనలో ననేకమందికి తెలియదు. మనము తీర్థములని వేనినను చున్నాము? మన మనుకొనునవి తీర్థము లగునా కాదా యని విచారింతము.

సాధారణముగా మనము కాశి, రామేశ్వరము, గయ, ప్రయాగ మున్నగుస్థలములను అచ్చట గంగాది నదులను పవిత్రకరమైన తీర్థములని యనుకొనుచున్నాము. మఱియు నాయా స్థానములందలి గంగాది జలములలో స్నానమొనర్చి యచటి దేవాలయములలోని దేవుళ్ళను దర్శించినచో మన సమస్త పాపములు నశించునని కూడ భావించుచున్నాము.

గంగాస్నానము సమస్త పాపముల పోగొట్టుటయే గాక, సకల ఫలప్రదాయినీ యనిగూడి మన పురాణములలో ననేకవిధముల వర్ణించిరి. అగ్నిలో వేయఁబడిన పదార్థములెట్లు భస్మీభూతము లగుచున్నవో అట్లే మనము చేసిన సమస్త పాపములు గంగాస్నానమువలన దూరీకృతము లగునని మన పురాణములు చెప్పుచున్నవి. కొన్ని కొన్ని పురాణములలో, స్నానముగూడ చేయనక్కరలేదు, గంగా దర్శనము వలననే సమస్త పాపములు పటాపంచలు కాఁగలవని గూడ చెప్పఁబడియున్నది. "భవన్తి నిర్విషాః సర్పా యథా తార్క్ష్యస్య దర్శనాత్, గంగాయా దర్శనాత్, తద్వత్ సర్వపాపైః ప్రముచ్యతే"—అనగా గరుత్మంతుని దర్శన మాత్రమున పాములు విషరహితములైనట్లు, గంగా దర్శన మాత్రమున మానవుఁడు సమస్త పాపములనుండి విడివడఁగలఁడని దీని భావము.

గరుత్మంతుని చూచిన మాత్రముననే సర్పములు విషరహితము లగుచున్నవా? లేదు. ఆ గరుత్మంతుఁడు తమ్ము చంపునని తెలియుటచేత గరుత్మంతుని పట్ల నిర్విషము లగుచున్నవి గాని, అంత మాత్రముచే సర్పములలో విషము లేదనఁగలమా? ఘున గంగా దర్శన ఫలముగూడ నంతే. గంగా దర్శన ఫలమునందు మిక్కిలి విశ్వాసముగల మానవులెవరైన నా సమయమున తమ పాపములు నశించినట్లు భావింపఁగలరే గాని అంతమాత్రముచే పాపాత్ములు పుణ్యాత్ములు కాఁగలరని భావముగాదు.

"యద్య కార్య శతం కృత్వా, కృతం గంగావసేవనం, సర్వం తత్తస్య గంగాపో, దహత్యగ్నిరివేంధనమ్"

నూఱు చేయరానిపనులు చేసి గంగను సేవించినట్లయిన, అగ్ని కట్టెలను దహించివేయు విధమున, గంగాజలము లాయకృత్య దోషముల నశింపఁజేయునని యీ శ్లోకాభిప్రాయము.

నిజముగా మన మనుకొన్నట్లు గంగా స్నానమువలన సమస్త పాపములు నశించినట్లయిన నచటివారందరు నిత్య సుఖులు కావలసియుందురు. ఏలనన నచ్చట నున్నవారందరు నిత్యము గంగా దర్శనమేగాక గంగా స్నానముఁగూడఁ జేయుచున్నారుగదా? కాని యట్లు జరుగుచున్నదా? లేదుగదా? నిత్య గంగా స్నాతకులగువారును మనవలె సుఖ దుఃఖాదులకు లోనైయ్యే యున్నారు. వారు మరి పాపరహితులైనట్లు నిదర్శనమేమున్నది? అక్కడనున్నవారిని మనము చూచితిమా? ఏమో! వారు సుఖపడుచున్నారేమో యని మరల మనకు సంశయము కలుగవచ్చును. కాని మనలో నందరుగాకున్న నే కొద్దిమందియైన కాశీ, రామేశ్వరాది పుణ్యతీర్థ స్థలములకు వెళ్ళినవారున్నారు గదా? వారు నిజముగా పాపరహితులే యగుచో నిత్యసుఖులుగా నుండవలయునుగదా? అట్లు జరుగుచున్నదా? లేదుగదా? కావున గంగాస్నాన మాత్రముననే సర్వ పాప విముక్తులము కాగలమనుకొనుట వెఱ్ఱితనమే యగును.

ఇట్లనిన తీర్థములు లేవనిగాని వాటివలన ఫలితము లేదనిగాని నే ననుటలేదు. నిజముగా మానవుఁడు తరింపవలెననిన తీర్థసేవన మవశ్యము చేయవలయును. తీర్థసేవ చేయఁజాలనివారు తరింపఁజాలరని మనము గట్టిగా విశ్వసింపవచ్చును. ఇదేమిటి? ఇంతవరకు తీర్థసేవ నిష్ప్రయోజనమని చెప్పుచు మరల తీర్థసేవ మానవుని తరింపఁజేయఁగలదని చెప్పుచున్నానని పాఠకులకు సందేహము గల్గఁగవచ్చును. కాని మన మనుకొనునవి యదార్థములైన తీర్థములుగావు "తరంతియేన తత్తీర్థమ్" అనఁగా దేనిద్వారా తరింతురో అది తీర్థమనఁబడును. తరించడమంటే దాటుట యనియు, ముక్తినొందుట యనియు రెండర్థములు గలవు. దాటుట యన నదులు మున్నగువానిని దాటుట. మనము నావలద్వారా నదులు మున్నగువానిని దాటుచున్నాము; కాఁబట్టి యవి తీర్థములే కాఁగలవు, కాని మనము వానిని తీర్థములని చెప్పము. ఏలనన ముక్తికి, కారణభూతములైన వానిని తీర్థములని మనము భావింతుము. ఈ కారణముచే నావ మున్నగువానిని తీర్థములని మనము భావింపకున్నాము.

(ముక్తియన నేమో, దానికి కారణభూతములగు తీర్థము లేవియో రాబోవు సంచికలో వివరింపఁగలను.)

---

## వితంతువులు కావలెను

మా నర్సాపురం వితంతు శరణాలయములో 6 స్థానములు ప్రస్తుతము కాళీగా ఉన్నవి. ఆరుగురు వితంతువులు ఉండుటకు ఆ కాళీలు ఏర్పాటుగా ఉన్నవి. కులము, వయస్సుతో నిమిత్తము లేకుండా వితంతువులు చేర్చుకొనబడుదురు. వివాహములగు వరకు ఉచిత వసతి, ఉచిత భోజనములు ఏర్పాటుచేసినాము. కావలసినవారు, ఈ నెలాఖరులో చేరునట్లు దరఖాస్తు చేయవలెను. ఉత్తర ప్రత్యుత్తరములు రహస్యముగా ఉంచబడును.

ఎ. యన్. శెట్టి. బి. ఎ.

13-12-48

స్థాపకులు గౌరవ కార్యదర్శి,

వితంతు శరణాలయం, నర్సాపురం, పశ్చిమ గోదావరిజిల్లా

---

# లోకవార్తలు

గత సంవత్సరాంతంలో నెహ్రూ మైసూరు సంస్థానానికి వెళ్ళినప్పుడు అడవులను వినోదార్థము వేట చూడ వెళ్ళినారు. అప్పుడు వేటరులు గొప్ప అడవి ఏనుగును పట్టుకున్నారు. దాని విలువ రు. 50000 లు అట. అది పట్టుకోబడిన వెంటనే వ్యాధిగ్రస్తమై 12 గం॥ల లోపున ప్రాణాలు వదిలేసిందట. దానికి తెలుసు స్వాతంత్ర్యం విలువ.

♦ ♦ ♦

పాకీస్తానము ఏర్పడ్డనాటినుండి సాగుతున్న కాశ్మీరయుద్ధమును ఉభయరాజ్యాలవారున్నూ అంగీకరించి తాత్కాలికంగా నిలిపినారు. దీనివల్ల భారతయూనియనుకు రోజుకు 25 లక్షల రూపాయల ఖర్చు తగ్గిందట.

♦ ♦ ♦

పారసీకంలో టెహరాన్ పట్నమందు సంవత్సరాదినాడు (1.1 49) 13 అంగుళాలు మందం గల మంచుగురిసిందట. ఆ భారమున కాగలేక పేదవాళ్ల కొంపలు వందలకొలది కూలిపోయినవి. ఇండ్లక్రింద పడ్డవారు చచ్చారు. మిగిలినవారు కొందరు ఆ చలికి నిలువజాలక చచ్చినారు.

♦ ♦ ♦

కాలిఫోర్నియా (అమెరికా) లో ఒక నగరమందు 5 సం॥ల కుఱ్ఱవాడు క్రైస్తవమత బోధకుడు. అతడీ (1949) జనవరి 2 తేది మొదట దఫాగా వివాహము చేయించినాడట. వధువు వయస్సు 21, వరునికి 23 సం॥లు. ఆ పంచవర్షప్రాయుడైన పౌరోహితునికి సాయపడ్డ వాని సోదరుడు 2 సం॥ శిశువు. ఆపిల్ల కాయ తన 3 సం॥మునుంచి కూడా మతబోధ, చేయనారంభించెనని ఆయన తండ్రి అన్నాడు.

♦ ♦ ♦

భారతదేశంలో సాలీనా చనిపోతున్నవారిదామాషా సంఖ్య 60,00,000. వీరిలో 42,00,000 అంటే 60% పైన, విషక్రిమివ్యాధులవల్ల చనిపోతున్నారు. అంటే ఈవిషక్రిమివ్యాధు లంత హెచ్చుగా పీడించుకొని తింటున్నవన్నమాట. ఒక్క మలేరియావల్ల, భారత, పాకీస్థాన్ యూనియనులు రెంటిలో చేరి సాలీనా 10,00,000 చావులు. మరి ఈ వ్యాధివల్ల చచ్చేవాళ్లకు, బ్రతికేవాళ్లకు అయ్యే వైద్యకట్నాలు, వీరు వ్యాధిగ్రస్థులు, అశక్తులు, అయినందువల్ల, నిర్మాణాత్మకమై పనిపాటలు సాగకుండా వ్యర్థమయ్యే కాలమువిలువ మొదలైనవన్ని లెక్కకట్టితే తేలిన మొత్తం రు. 150,00,00,000. ఇంకా యిలాంటి క్రిములవల్ల వచ్చే వ్యాధులలో ముఖ్యమైనవి టైఫాయిడ్, కలరా, రక్తగ్రహణి, ప్లేగు. ఈ వ్యాధులవాహకులు ఈగలు, దోమలు,

రెక్కల పురుగులు. ఈ వ్యాధులవల్ల ప్రత్యక్షనష్టాలు కాక పరోక్షనష్టాలెన్నో. మానవవాసయోగ్యం కాక పోవడంచేత మన్యంలాంటి సుక్షేత్రాలలో పంటలులేవు. అందుచేతనే ఎన్నోఖనిజాలు భూమిలోనే అణగారిపోతున్నవి.

♦ ♦ ♦

అమెరికా ప్రభుత్వములో ప్రభుత్వ నిర్వహణ విధాన నిర్మాణశాఖ అని ఒకటి ఉన్నది. డొరోతీ ఫాస్‌డిక్ కన్యనుదానిలో నొక సభ్యురాలినిగా ప్రభుత్వము నియమించినది. ఆమె అంతర్జాతీయ నిర్మాణముల విషయమై చక్కగా తెలిసిన యామె యట. ఈశాఖలలో నిట్లుయున్నతపదవి నందిన ప్రథమయువతి ఈమెయే.

♦ ♦ ♦

ఢిల్లీలో కేంద్రశాసన సభయందు అధ్యక్షుని పీఠమునకు పైగా బ్రిటిష్ రాజకిరీటమున్నూ, రాజలాంఛనమున్నూ చిత్రితమైయున్నవి. రేపు ఫిబ్రవరి 1 తేదీన ఆదాయవ్యయపట్టిక చర్చించబడేనాటికి అవిరెండు తొలగి భారతజాతీయ పతాకమున్నూ, అశోక ధర్మచక్ర చిహ్నమున్నూ అక్కడ అవతరించగలవు. అధ్యక్షుని ఆజ్ఞానుసారం ఇట్లు అగుచున్నది.

♦ ♦ ♦

ఢిల్లీలో ఈ మాసారంభంలో చలి విస్తారమైనది. ఆరుగురు చలికి గడ్డకట్టుకపోయి చనిపోయినారు, అందొక శిశువు కలదు.

♦ ♦ ♦

బొంబాయి డాక్టర్ మేజర్ జనరల్ సర్. యస్. యస్. సోకీగారి పరిశోధనలవల్ల ప్లేగుజాడ్య నివారకమగు మూడు మందులు బయటపడ్డవి; వానిలో ముఖ్యమైనది స్ట్రెప్టోమైసిన్.

♦ ♦ ♦

నైజాము నవాబునకు ఇకపైవారి స్వంతఖర్చుకని ఒకకోటి రూ||లు సాలీనా ఇవ్వవచ్చును అని యోచిస్తున్నారట.

♦ ♦ ♦

నూతన సంవత్సరాదిరోజున ఇంగ్లాండు, ఫ్రాన్సు, బెల్జియం దేశాలలో గాలి, వాన, మంచువరదలు-విజృంభించాయట.

♦ ♦ ♦

రోడ్లమీద నడచేటప్పుడు హెచ్చరికలు చేయను క్రొత్త సాధనాలు కనిపెట్టినారు. రంగులలైట్లు మారుతుంటవి. దానితోపాటు పాదచారులకు శబ్దంకూడా వినబడుతుంది. మర్యాదగా 'పో', 'వద్దు'; 'నిలు' ఈ విధంగా చెప్పవచ్చుట. దీనిని లండనులో ప్రయత్నించి చూస్తున్నారు.

♦ ♦ ♦

అమెరికాయందలి ఒక నగరంలో—ఒక యింట్లో ఒకాయన బాడుగకున్నారు, ఆయన తన ఆధీనంలోవున్న ఇంట్లో ఒక భాగాన్ని ఇంటి యజమానికే అవసరంకొద్దీ తిరిగీ బాడుగకిచ్చినాడట. ఇప్పుడా బాడుగదారు ఇంటి యజమానిని తాను తిరిగీ బాడుగకిచ్చిన భాగంలోనుంచి లేవదీయమని అధికార్లకు వ్రాసుకొన్నాడు!



## పీడితులైన పిల్లలకు అనేక పుష్కరాల నుంచి సేవ



పసితనమున బల్ల (లివర్) వ్యాధిచే పీడించబడు తూన్న వారికి, జమ్మివారి "లివర్ క్యూర్" అనేక పుష్కరాలనుండి సహాయకరమౌటచే వేలానవేల అమూల్య ప్రాణాలు రక్షింపబడినవి

ఈ వ్యాధిని నిర్మూలించుటకు డాక్టర్లు సామాన్యావస్థలో "సింపుల్" క్యూరును, క్లిష్టావస్థలో 'కాంప్లికేటెడ్' క్యూరునూ చికిత్సగా వాడుచున్నారు. 'సింపుల్' లివర్ క్యూర్ చిన్న మోతాదులవాడుక, ఆకలినీ జీర్ణశక్తినీ వృద్ధిపరచి మలబద్ధకమును పోద్రోలి లివరు, ప్లీహములు క్రమపద్ధతియందుండునట్లుచేసి, వ్యాధులురాకుండ ఉపయోగించును.

పిల్లలందు లివర్, ప్లీహములు తల్లినిబట్టి యేర్పడుతాయి దీనిని అనుసరించుకొనియే 'జమ్మివారి టానిక్' ఆయుర్వేద సిద్ధాంతానుసారంగా తయారైనది గనుక, బల్లవ్యాధిచే పీడింపబడిన పిల్లలయొక్క తల్లులు గర్భిణులైనప్పుడు ఈ 'జమ్మివారిటానిక్'నుసేవించుట ఉత్తమం.



జమ్మివారి

# లివర్ క్యూర్

అన్ని చోట్లా దొరకును

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్సు
మైలాపూరు, మద్రాసు, ఫోన్ నం|| 8139
ఇతరచోట్లు . బెజవాడ, విజయనగరం కలకత్తా
బొంబాయి, లక్నో, బెంగుళూరు, తిరుచునాపల్లి, etc.

SISTA 'S J. 234



## మీ రక్తం పలచనయిందా?



రక్తపలచన, అంటే, 'రక్తహీనత అనేక కారణాలవల్ల కలుగుతుంది. రక్తహీనతవల్ల, మీకు నీరసం, జీవితంలో ఉత్సాహమే లేకపోడం సంభవిస్తాయి శరీరానికి అవసరమయిన శక్తి, ఆహారమూ, యిచ్చే అనేక వస్తువులు వాడబడ్డాయికనక, రక్తోజ్, ఆహారాల్లో మేటిమిన్న ఈ టానిక్, రక్తహీనతని నిర్మూలించి, తిరిగి ఆరోగ్యం ప్రసాదిస్తుంది చంటిపిల్లల తల్లులకి, ఇది అమోఘమైన టానిక్.'



# రక్తోజ్

దక్కన్ ఆయుర్వేదాశ్రమ్ ఫార్మసీ లిమిటెడ్
హైదరాబాదు-దక్కన్.

SISTA 'S DAY 536 TL.



# చక్రధారి



లోకంలో శాంతి కన్పించదు. సర్వమూ సమరోన్ముఖము. రాగద్వేషములు తలలు విరియబోసుకొని తంధనా లాడుతున్నాయి. అలాంటి పరిస్థితులలో రోజులు గడుపుతూ ప్రజలకు లక్షలాది సినిమాప్రేక్షకులకు "చక్రధారి", అనేఫిలిం చిత్తశాంతి చేకూరుస్తున్నది. ఇది ధోడకీ గ్రామంలో కుమ్మరి అయిన గోరాకుంబరు అనే భక్తుని నిరాడంబరమైన చరిత్ర.



'బాలనాగమ్మ' 'మంగమ్మ' 'చంద్రలేఖ' ఇత్యాది అద్భుతమైన ఫిల్ములు నిర్మించడములో అందె వేసిన చేయి, శ్రీ యస్. యస్. వాసన్. ఆయనే దీనిని తీర్చి దిద్దినది.

ఈ చిత్రంలో పేరుపొందిన తెలుగుతారలు నాగయ్య, నారాయణరావు, పుష్పవల్లిగార్లు తమ కళా నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

ఒక సామాన్యజీవి అయిన కుమ్మరి భగవద్భక్త్యావేశపరుడై, ఏకాంత భక్తివల్ల, సేవాపరాయణత్వం వల్ల ఈశ్వర ప్రసన్నత పొందాడు. ఇందుకై అతడు తన నిత్యజీవితంలో చేసిన ప్రయత్నాలు, పడ్డభంగపాట్లు, శ్రమలు, అవాంతరాలు,- తుదకు పొందగల్గినసిద్ధి- అన్నీ ఈగాథలో వివరంగా రూపించబడ్డాయి.

నాగయ్య నటన చూచినవారి చిత్తం చూరగొంటున్నది. తులసీపాత్రధారిణి పుష్పవల్లి. మనోహరంగా తన పాత్రను నిర్వహించినది.

ఉద్రేకపరచే "చక్రధారి" చిత్రంలో — నృత్యము, సంగీతము, హాస్యము అన్నీ అందంగా, అవసరమైనంత పొందుపరుప బడ్డాయి. ఆంధ్రదేశంలో పొంగలిపండుకిది అన్ని కేంద్రాలలోను— బహిర్గత మవుతుంది! ఇప్పటికే ఇది మద్రాసులో (గ్లోబ్, స్టార్ థియేటర్లలో) ఇంకా దక్షిణాన చాలా ముఖ్యమైనచోట్ల—ప్రదర్శింపబడుచున్నది. వేలాది జనంవచ్చి చూచిపోతున్నారు.

## చంద్రలేఖ

హిందీ నకలు 5-1-49 న మద్రాసులో పత్రికలవారి కిది చూపబడ్డది...

ఫిల్ము ప్రపంచంలో "చంద్రలేఖ" తారామండల మంటునట్లున్నది. విమర్శగాచూస్తే అందులో ఏమీ లేదనవలసి వస్తున్నది. కాని ద్రష్టలను అద్భుతరసంలో ముంచి ఎత్తుతున్నది. కథకు ఒక నీతిగాని రీతిగాని లేకపోవచ్చు. ఫలానా కాలంనాటిది, అని కల్పనైనా, చెప్పడానికి అవకాశముండాలి, కాని అది కన్పించదు. కాలంకూడా చాలా పట్టుచున్నది అయితే కూర్చున్నవాడు కుర్చీ విడువకుండా విసుకులేకుండా చూస్తాడు. అనేక అద్భుత సన్నివేశాలతో మనోహరంగా ఉన్నది. ముందు తమిళంలో వచ్చినదీచిత్రం. ఆవల హిందీలోకూడా వచ్చినది.

హిందీలో తీయడానికి చాలా తంటాలు పడ్డారు దాక్షిణాత్యులచేత ద్రావిడులచేత హింద్రీభాష పల్కించడం; ఆ ఉడుపులు వగైరా మార్చడం మొదలైనవి కష్టతరమే. ఒక్కొక్కచో అరవ హిందీ ఉచ్చారణ కన్పిస్తున్నా మొత్తముమీద అంతగా పట్టు ఇవ్వడంలేదు. ఉత్తర హిందూస్థానీవాళ్ళకు ఆకర్షణీయంగా ఉండడానికి అని దీనిని చాలావరకు తిరిగి తీయవలసి వచ్చినదంటున్నారు. బంగాళ గవర్నరు హిందీ మాతృభాషగా కలవారునైన శ్రీశ్రీ కైలాసనాథ కట్జూగారు ఈ చిత్రంచూచి ఇట్లా అన్నారంటే దాని ప్రాశస్త్యము చెప్పనక్కరలేదు.

**"నేను చూచినవాట్లోకెల్లా ఇది ఉత్తమమైన చిత్రము ఒకగంట ఉండిపోదామని వచ్చినాను. అంతా అయ్యేదాకా ఉండిపోయినాను. ఏదో స్వప్నలోకంలో ఉంటిని."**

ఫిల్ములో విలక్షణ సన్నివేశాలను తెల్పే చిత్రములతోగూడిన యొక చిన్న పుస్తకమును ప్రచురించారు. 'దాని అందము చాల ఆకర్షణీయంగా ఉన్నది. ఈ గ్రంథమునే ఇంత విలక్షణముగా ప్రచురించిన వారు అసలు చిత్రాన్ని ఎంత కష్టపడి ఎంత అందంగా అద్భుతంగా తీసివుంటారో అనేది దీన్ని చూచిన వెంటనే స్ఫురించకపోదు.

ఈ గ్రంథంలోనే క్లుప్తంగా ఒక్కొక్క సన్నివేశం ఫిల్ముతీయను పడ్డశ్రమ, పెట్టిన ఖర్చు, చేసిన సాహసం—అది వక కథగా ఉన్నది—అన్ని వర్ణింపబడ్డాయి. ఈ ఫిల్ముకు సంబంధించిన ఏ ఒక్క హంశం తీసుకొన్నా—ఈ ఫిల్ము తప్పక చూడవలెననిపిస్తుంది. చూచిన తర్వాత మరీ మరీ చూడవలెననే ఆసక్తి ఏర్పడుచున్నది. ఈ పుస్తకం రు 1-0-0 ఖరీదు పెట్టారు. ఈ ఖరీదు చాలా తక్కువే అనాలి, ఈ రోజుల ధరల్లో. ఫిల్ము ఎన్నిసార్లు చూచినా—ఆ దృశ్యముల నప్పుడప్పుడూ కాగితంమీద చూచుకోవాలనిపించినవారికి ఈ పుస్తకం చాలా ఉపయోగకారి. స్త్రీలు, శిశువులు ఈ పుస్తకంచూస్తే కొనేదాకా విడువరు.

(సినీఫాన్)

# సామెతలు

406. అబ్బురాన అబ్బాయిపుడితే ఆముదమున ముడ్డికడిగెను.

407. అవ్వా కావాలి, బువ్వా కావాలి అంటే యెట్లా వస్తుంది?

408. అయ్యలో ప్రాణము కొయ్యలోకి వచ్చినట్లు.

409. అతివినయం ధూర్తలక్షణము.

410. అత్తగారితద్దినము కోడలుపెట్టినట్లు.

411. అబ్బురాన అబ్బాయికి మీసాలువస్తే రెండుచేతులా మెలివేస్తే ఉన్నపరకలు నాలుగూ వూడిపోగా వట్టిమూతికి వకచెయ్యిచాలునని రెండోచేత్తో తల గోక్కొన్నాడట.

412. అడివిలోనికెళ్లి అమ్మా అని యేడిస్తే యెవరికి పుట్టావురా కొడకా అన్నదట.

413 అన్నీ కుదిరాయిగాని అంచుకు తోగరు లేదన్నట్లు.

414. ఆడితప్పరాదు, పలికిబొంక రాదు.

415. ఆలులేదు, చూలులేదు; కొడుకుపేరు సోమలింగం.

416. ఆనవాయిలేనిది, అద్దముచూచుకొంటె బహుముఖమయింది.

417. ఆరునెలలు సాముచేసి మూలనున్న ముసలమ్మను చితకపొడిచాడట.

418. ఆకాశమంత ఆకలి, సూదిబెజ్జమంత గొంతు.

419. ఆ పప్పు ఈ నీళ్లకు ఉడకదు.

420. ఆముదపుగింజలు ఆణిముత్యాలవుతాయా.

421. ఆ రాటపుకదురు యేరాటమునకు పెట్టిన బరబర.

422. ఆశకు అంతములేదు.

423 ఆశ్ల బోధిస్తుంది; అవమానము భాదిస్తుంది.

424. ఆవగింజసందుంటే అరవయిగారెలు తినవచ్చుగా.

425. ఆర్చేవారేగాని, తీర్చేవారులేరు.

426. ఆరునిమిషాలలోభోగం. ఆరునెలలు రోగం.

427. ఆవు ఎక్కడతిరిగితేనేమి, ఇంటికొచ్చి కడివేస్తేచాలు.

428. ఇల్లు అలుకగనే పండుగగునా?

429. ఇంటివాడికి ఇనుపచీల, పైవారికి బంగారుచీల.

430 ఇంట్లో ఈగలమోత; బైటపల్లకీలమోత.

431. ఇల్లుమాసి పిల్లి సమర్తాడిందట.

432. ఈయూరునకాయూరెంతో ఆయూరునకీవూరు అంతే.

433. ఈతాటాకుల చప్పుళ్లకు కుందేళ్లు బెదరునా?

434 ఉద్యోగము పురుషలక్షణము; అది పోతె అవలక్షణము.

435. ఉపాయవంతుడుంటె ఊరికియెరవడి.

436. ఊరుపై ఊరుపడిన కరణముపై కాసు పడదు.

437. ఋణశేషము, వ్రణశేషము, అగ్ని శేషము నుంచరాదు.

438. ఎంతచెట్టున కంతగాలి.

(సశేషము)




శ్రీమతి ఆల్బర్ట్ ఆస్‌బార్న్‌సతి శాల్వేషన్ ఆర్మీ (సంరక్షణ సైన్యం) 'యందు ప్రథమ స్త్రీ సేవకురాలు. ఆమె గౌరవార్థం గావింపబడిన సమావేశంలో, చెన్నపురిలో, ఇట్లని ఉపన్యసించినది :—

చెన్నపట్నంలో యోచనా సమర్థులు, ముందుచూపు గలవారు అయిన కొందరు మహిళామణులు జట్టుగాచేరి సాంఘిక దురాచారాలను రూపుమాప కృషిచేయడం సంతోషకరము. సాంఘిక సేవకంటె నిర్మాణ కార్యక్రమము నాకు వేరే కన్పించదు. సంరక్షణ సైన్యంలో పురుషులవలెనే స్త్రీలును ముఖ్య కార్యక్రమము నెరవేర్చవలసి యున్నది. అందు స్త్రీలకు పురుషులకు ఒకేమాదిరి తర్ఫీదు ఇవ్వబడుతున్నది. ఈ సైన్యములో స్త్రీ నాయకత్వము హెచ్చుగా గౌరవనీయమై ఉన్నది. ఈ సంరక్షణ సైన్యం చేసే సాంఘిక సేవ మూడు విధాలు ' ముందు జాగరూకత; సంరక్షణము, మంచిదారిలో పెట్టడము. స్వంతఇండ్లు లేనివారు, స్వంత ఇండ్లనుండి దూరస్థమైనవారు అయిన స్త్రీల కొందరికో తలదాచుకోను ఇళ్లు చూపారు. జబ్బుచేత బాధపడేవారికి, దిగులుచేత క్రుంగిపోయేవారికి,—రక్షణ ఇవ్వడానికి ఆసుపత్రులు పెట్టి నడిపించారు. అనాథ బాల బాలికలకు, ఆధరువులేని శిశువులకు శరణాలయాలు నడుపుతున్నారు. తప్పుదారి త్రొక్కిన యువతులకు శరణ్యమిచ్చి బాగా బ్రతుకను తగిన తర్ఫీదునిచ్చే సంస్థలు నడుపుతున్నారు. ఈ సైన్యంలో తమ జీవితాలను సాంఘిక సేవకై అర్పించిన యువతులెందరో యున్నారు. ఆర్తిగల జీవులు వచ్చి దరిచేరితే ఆదరించడమే వారి ముఖ్యోద్దేశము.

అంతర్జాతీయ సఖ్య సమితివారి యాజమాన్యమున జరిగిన క్రిస్మస్ సంతోష ఉత్సవమునందు పాల్గొన్న శ్రీశ్రీశ్రీ భావనగర్ మహారాజావారు, చెన్నై రాజధాని గవర్నరుగారు ఇట్లుపన్యసించిరి :—

"1949 సం॥ ను చక్కగా ప్రారంభించినాము, ఈ స్థితి నిలువబెట్టుకుందాము కుల మత విభేదములు మన ఐక్యత చెడగొట్టకుండుగాక, స్వాతంత్ర్యం సిద్ధించినతర్వాత పూర్వముకన్నా ఐక్యతా భావము అవసరము ఎక్కువైనది. మన నాయకు లాఐక్యత సాధించుటకు చాల కష్టపడుచున్నారు. మన అనైక్యతవల్ల వారి ప్రయత్నములు భంగముగాకుండుగాక. మన శాస్త్రములనుండి ఒక్క శ్లోకం చదివి ముగిస్తాను :—(దాని అర్థము.)

మన మందరము సుఖవంతుల మగుదుము గాక. మన మందరము ఆరోగ్యవంతులమగుదుము గాక.
మన మందరము మంచి గ్రహింతుము గాక. సౌఖ్యములేని వా డెవ్వడును లేకుండుగాక,

సంయుక్త పరగణాల సోషలిస్టు మహాసభ కధ్యక్షత వహించిన శ్రీమతి అరుణ ఆసఫాలీగారిట్లుపన్యసించిరి '—

స్వాతంత్ర్యము సిద్ధించిన తర్వాత—"కిసాన్ మజ్దూర్ రాజ్యం" ఏర్పరుస్తాము—అనే తమ పూర్వదత్త వాగ్దానమును నెహ్రూ ప్రభుత్వము నెరవేరుస్తుందని సోషలిస్టులు ఆశించారు. ఆ ఆశ లడియాసలైనవి. దానికిబదులుగా దేశంలో అర్థికముగ క్లిష్టస్థితి ఏర్పడినది, ఈ దేశంలో గతించిన బ్రిటిష్ పరిపాలన

నియమించిన ప్రాత నిరంకుశ ప్రభుత్వవర్గమే పరిపాలిస్తున్నది. కాబట్టి సోషలిస్టులు ప్రజా సామాన్యాన్ని తమ శక్తి, తమ హక్కులు తెలుసుకొనేటట్లు సన్నాహ పరుపవలయును. అప్పుడే వారు నిర్మాణాత్మకమైన విప్లవము తీసుకొని రాగలరు. ప్రస్తుతపు ఆర్థిక దుస్థితి తొలగవలెనంటే, ఈ ప్రభుత్వమునే విప్లవాత్మకమైన ఆర్థిక ప్రణాళిక నవలంబించునట్లు వత్తిడి అయినా చేయవలెను; లేదా తమ ఓట్ల శక్తిచే త్రోసివేయనైన వేయవలయును.

అమెరికాదేశపు శాస్త్ర పరిశోధకుడు డా. బర్లింగాం శాస్త్రజ్ఞుల మహాసభకు విచ్చేసి మనదేశం పరికించినమీదట ఇలా చెప్పినాడు :—

“రాగల 50 సం॥ల లోపున అన్నిటికన్నా పెద్ద రాజ్యాలలో భారతదేశం ఒకటి కానున్నది. ప్రపంచములో ఇతర చోట్లకన్నా భారతదేశంలో ప్రతీదీ తెలుసుకోవలెననే ఆసక్తి హెచ్చుగా ఉన్నది. అమెరికా భారత దేశములు తమ తమ విజ్ఞానములను ఇచ్చి పుచ్చుకుంటూండాలి. అమెరికన్ శాస్త్రజ్ఞుల కిక్కడికి రావడం చాలా లాభం. మేమెంత నేర్పగలమో, అంత భారతదేశమునూ నేర్పగలదు.”

గాంధీ ప్రధాన శిష్యురాలైన శ్రీమతి డా. సుశీలానయర్ గారు అమెరికా వెళ్ళి విద్య పూర్తిచేసుకొని వచ్చారు. అక్కడ తమ అనుభవాలనుగూర్చి ఆమె ఇట్లాఅన్నది:.

“పురిటాలును, శిశువును సంరక్షించేపట్ల అక్కడ చాలా ఘనులైన వైద్యులు అవలంబింపవలెననే విషయాలు మనకు చిరకాలగతంగా అనుభవంలో ఉన్నవేనని తెలిసి ఆశ్చర్యపోయినాను. ఇంతవరకువలె క్రొత్తగా పుట్టిన శిశువును అద్దాల గోడల గదులలో మిగతా శిశువులందరితోపాటు కలిపి ఉంచడంకన్నా తల్లిని పిల్లనుచేర్చి ప్రత్యేకంగా పురిటిగది ఏర్పరచి ఉంచడం మంచిదంటున్నారు ఇప్పుడు వారు. దీనివల్ల పుట్టినప్పటినుండిన్నీ ఆ శిశువుకు మాతృ వాత్సల్యం మప్పడము వారి ఉద్దేశము. గాంధీ చిరకాలం క్రిందటనే ఈ సిద్ధాంతం చెప్పినారు.”

అమెరికాలో ఫెడరల్ సెక్యూరిటీ ఏజన్సీకి చెందినాయన ఒకాయన డా. సుశీలా నయర్‌నుగూర్చి ఇట్లా అన్నాడు :—

పూర్తిగా స్థిమితము, ఆచరణ సాధ్యాసాధ్యముల నెరుగు ప్రకృతిగర గంభీరమైన ఆదర్శప్రియ,— భారతదేశపు ఉత్తమ పౌర ధర్మశాలిని—ఈమె.

(16 వ పుట తరువాయి)

యువతీ యువకులకుండుచో "గృహలక్ష్మి" ఇంకను ఉత్తమ రచనలను ప్రకటింప గల్గును. ఈ తాతగారు చిరకాల మాయురారోగ్యములు గల్గి తన్నిట్లే యువలాలించుచుండుగాక యని 'గృహలక్ష్మి" నిరంతరము కోరుచున్నది. మద్రాసు విశ్వ విద్యాలయమునందు అసిస్టెంటు రీడరుగానున్న శ్రీ నిడదవోలు వెంకట్రావు పంతులు ఎం. ఏ. గారు—విస్మృతాంధ్ర కవయిత్రుల చరిత్రల మూడింటినంపిరి. శ్రీ కల్లూరి అహోబలరావుగారు, అనంతపురం మండలవాసులు, తేట తెనుగున "గృహలక్ష్మి"—శతకమును వరుసగా పంపుచున్నారు. ఒక కాలేజిలో లెక్చరర్ గారు (పురుషులే) "రామం" అన్న మారుపేరున శాస్త్ర విషయములనుగూర్చి కొన్ని రచనల పంపగా ప్రచురించితిమి. శ్రీ రాజా రంగయ్యప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు కుమారరాజావారు, వేదకాలపు స్త్రీలు అన్న తమ అమూల్య వ్యాసమును పంపగా ప్రచురింప గల్గితిమి. ఇంకను పలువురు కవులు, కవయిత్రులు అప్పటప్పటికి మమ్మును, మా గృహలక్ష్మిని ఆశీర్వదించియు, అభినందించియు—పాటలు, పద్యములు, వ్యాసములు పంపియున్నారు; వారికి వినతులొనర్చుచున్నాము

మా సంపాదకులు శ్రీ డాక్టరు కే. యన్. కేసరిగారు గత సం॥న కేసరీ హైస్కూలు వార్షికోత్సవ సందర్భమున తమ జీవితగాథ నొక్కింత చెప్పుట తటస్థించినది. అది మునుముగా వారు "నా చిన్ననాటి ముచ్చట్లు"—అని తమ అనుభవములోగల్గ పలువిషయములగూర్చి వరుసగా వ్రాయుచున్నారు. సుమారు 60 సం॥ల అనుభవములు—చదువ సొంపుగానున్నవని పలువురు పాఠకులు ప్రశంసించి యున్నారు.

మేము ఈరెండు సంపుటములందును కొన్ని క్రొత్తలకల్పించి సాగించుచున్నాము:-

పాకకళ, బ్రతుకు తెరువు, గృహవైద్యము, ఇంటిపనులలో మెళుకువలు—అను నాలుగు శీర్షికలక్రింద ప్రతినెలయు నేదే నొక్కొక్క సంగతి ప్రచురించుచున్నాము. మా రచయితలే ఆయా సంగతులగూర్చి వ్రాసినప్పుడు—వారివారి పేర్లతో ప్రకటించుచున్నాము. వారు విరివిగా పంపుకొలది వానినే ప్రచురించుటకు వీలగును. కావున మా రచయితల నిందుకు హెచ్చరించుచున్నాము. అట్లే సామెతలను ప్రకటించుచున్నాము."

బాలానందము నిట్టిదే. శ్రీ డా. పోలాకి శ్రీనివాసరావుగారు ఈ విషయమై నొక చిన్న గ్రంథమే రచించి యిచ్చినారు. దానినుండి కొలదిగా ప్రచురించితిమి. ఇకపై విరివిగా ప్రచురింతుము. ఇతరులు నీ శీర్షిక క్రింద వ్రాయవలసి యున్నది.

కథలు చాలమంది వ్రాసి పంపుచున్నారు; కాని వానిలో పెక్కింటిని చిన్న కథలనుటకన్న చిన్న నవలలనుట సబబు. చిన్నకథ రచన యొకకళ. కావుననే—పురుషు

లలో నొక్క చింతా దీక్షితులు గారికే వచ్చినది—"కథక చక్రవర్తి"—అన్న బిరుదు. అట్టి బిరుదుపొందను మా సోదరీమణు లర్హతపడవలయునని మనవిచేయుచున్నాము.

ప్రచురింపబడిన వేగాక-స్థళసంకోచముచే ప్రచురింపబడజాలక నిల్వయుండిపోయినవి సుమారు 3 వందలదాకా స్త్రీ పురుషుల రచనలున్నవి. నాటిలో చాల యుత్తమమైనవే ఉండిపోయినవి. వారందరు మమ్ము క్షమింప గోరెదము. వాని వివరములను రాగల సంచికలలో "మా తపాలపెట్టె" దులిపి వివరింతుము.

"గృహలక్ష్మి" పత్రికతోపాటు సంపాదకు లారంభించి ప్రతి సం॥ము నడుపు చుండిన గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవమును, "గృహలక్ష్మి" పునరాగమనముతో పాటు గత సం॥న శ్రీ కేసరిగారు తిరిగీ ప్రారంభించిరి. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారీ గౌరవము పొందిరి.

ఆంధ్రదేశమున స్త్రీ పురుషులు సమాన సంఖ్యగలవారైనను ప్రత్యేకముగ స్త్రీల కొరకేర్పడిన పత్రికలు యే రెండు, మూడో! పురుష రచయితల రచనా కండూతిదీర్ప నెన్నియో పత్రికలున్నవిగదా? అపూర్వము, అపూర్వము, ఆశ్రుతము అసదృశమునైన ఏ 'సోమపాట' వంటివో సంపాదించియు, ఏ రామభద్రాంబిక చరిత్రవంటివో రచించియు, ఏ సులభసాధ్యముగాని శాస్త్రవిషయములనో వివరించియు పంపినచాలదా? స్త్రీలనే యోచించి, రచించిపరస్పరము తమ యూహల, కల్పనల, అభిప్రాయముల తెలుసుకొని విజ్ఞానాభివృద్ధిని బడయనిండు అని పురుషవరేణ్యుల ప్రార్థించుచో మాపై వారు కినియకుందురుగాక.

సోదరీమణులును—తాము తావిచ్చినంత మేరకే పురుష రచనలిందు కన్పించు చున్నవని తెలుసుకొన్న చాలును.

# సంపాదకీయములు

## ఫిలుములపొడవు—కాలము

**సినిమా**ఫిలుములు—15000 అ॥లకు హెచ్చుండరాదనీ, విరామకాలము సహా 3 గం॥ల కన్న హెచ్చు కారాదని, మద్రాసు ప్రభుత్వమువారుచేసిన ఉత్తరవులను మేముహృదయపూర్వకముగ అంగీకరించి అందుకు వారినభినందించుచున్నాము. దేశీయ ధనము కాలము వ్యర్థము కాకుండ ఈ ఉత్తరువు కాపాడును. ఫిలుము నిర్మాతలు తమ కల్పనలను క్లుప్తమైనకాలములో ఉజ్వలముగ ప్రదర్శింప తంటాలు పడుటచే - ప్రజల అభిరుచులను మారును. చిత్రములకును అందమిచ్చును. అన్నిటికి మించి మేము హర్షించునది మరొక్కటున్నది. తల్లులు చిత్రముచూచి హర్షింపజాలని శిశువులనెత్తుకుని చిత్రములకు వెళ్లుటకూడనిపని; ఆచీకటిలో వారు పోరుపెట్టి తమతల్లులకేగాక ఇతర ద్రష్టలకును చికాకు కల్గింతురు. ఇకనాతల్లి శిశువును ఇంటవదలి పోవలెనంటే—రానుపోను అరగంట పట్టినను—3½ గం॥లకు పైన ఏ తల్లియు తన శిశువును విడచిఉండరాదు; ఉండలేదు. కావున శిశువుల తల్లుల దృష్ట్యా ఇది ఉత్తమోత్తమమైన ఉత్తర్వు.

## అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ.

అఖిలభారత కాంగ్రెసు వర్కింగుకమిటీని నూతనాధ్యక్షులు శ్రీ డా. పట్టాభిసీతారామయ్యాపంతులుగారు ఏర్పరచినారు. అధ్యక్షులు ఆంధ్రులైనప్పుడు జనరల్ కార్యదర్శిని కూడా ఆంధ్రునిగానే ఎన్నుకొనుట న్యాయమే. ఇందుకై శ్రీ కళా వెంకట్రావుగారిని రెవిన్యూమంత్రి పదవినుండి తొలగించవలసి వచ్చినందుకు చింతించుచున్నాము. ప్రస్తుతమంత్రివర్గమున 'మనవిచేసుకుంటే చెవియొగ్గి వినేవాడాయన యొక్కడు' అని ప్రతీతి.

## స్త్రీ వయోజనవిద్యాకళాశాలలు.

మద్రాసు ప్రభుత్వంవారు స్త్రీ వయోజనవిద్యాకళాశాలలను మూడింటిని రాష్ట్రంలో మూడు భాషా భాగాలలోను ఏర్పరచడానికి నిర్ణయించినారు. ఉడిపిలో నొకటి (బహుశా ఇది కేరళ కర్నాటకుల కుభయులకు ఉపకరించునేమో), తెలుగువారికి బందరులోను, అరవవారికి చిదంబరంలోను ఇవి ఏర్పాటగుచున్నవి. ఈ కాలేజీలను నిర్వహించే బాధ్యత మద్రాసు ప్రభుత్వం క్రింద నడుస్తున్న స్త్రీ యోగక్షేమ శాఖ(The Department of women's welfare)వారి అధీనము చేయబడినది. ఈ కాలేజీలలో ఇదివరకే కొంత చదువు చదివి ఉన్న ఆడువారికి అనుకూలమునను సరించి పగటిపూట ఏదేనొక కాలమున—విద్యగరుపబడునట. వాఙ్మయం రాజకీయాలు, చరిత్ర, ఆర్థికశాస్త్రము, సాంఘికశాస్త్రము, ప్రాథమికశాస్త్రపాఠములు మున్నగునవి నేర్పుతారట. ఇంకా స్త్రీలకవసరమైన విషయాలున్ను చెప్తారుట. నెలకు రు. 1-0-0 ఫీజు. అయితే ఇందుతర్ఫీదుఅయిన విద్యార్థినులకుపిద్దప జీవితంలో ఈవిద్య వీరికెలా ఉపయోగపడుతుంది అనేదాన్ని పట్టి ఈ స్కీము మంచి చెడ్డలు నిర్ణయింపదగును. ఈ డిపార్టుమెంటువారు సిలబస్ ఏర్పరచారని ప్రభుత్వం

దానిని పరిశీలించి అంగీకరించిందని తెలుస్తున్నది. అయితే ఆ సిలబస్ ప్రత్యక్షంగా పరిశీలనగా చూస్తేగాని ఏమిచెప్పలేము. ఈవిద్యావిధానంలో బ్రతుకుతెరువు చూపించే పనిపాటులుకూడా నేర్పుతారని, ముఖ్యంగా పాకకళ శాస్త్రంగా బోధిస్తారని ఆశిస్తున్నాము. మొత్తమునకు స్కీము వుద్దేశం మంచిది. అయితే ఏ ఒక్క పట్నంలోనో ఒక్క సంస్థ పెట్టడంవల్ల ఏమిపని జరుగనా అని తోస్తున్నది. ఏ మైనను ఈ డిపార్టుమెంటు నడుపుతున్న శ్రీమతి పారిజాతంనాయుడుగారి ఉత్సాహం మాత్రం ఎన్నదగినది.

## భారతి రజితోత్సవం

1923 జనవరిలో కీ|| శే|| విశ్వదాత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారిచే స్థాపితమై పిదప వారి అల్లుడు శ్రీ శంభుప్రసాద్ గారు విడువక సాగిస్తున్న "భారతి"కి 25 సం|| లు నిండడంచేత దాని రజితోత్సవము అతి వైభవంగా "శ్రీబాగ్"లో జరిగినది. ఆహ్వానింపబడిన పెద్దలకు ఉపాహారముల విందైనపిదప శ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారి అధ్యక్షతక్రింద సభ జరిగినది. సభాసదుల నాహ్వానిస్తూ శంభుప్రసాద్ గారు నాగేశ్వరరావుగారిని స్మరించి వారి జ్ఞాపకార్థమై ఇకపై (1949 నుండి) ప్రతి సంవత్సరము భారతిలోని ఉత్తమ రచనకు రు 1116/- బహుమానమివ్వడం సంకల్పించామని ప్రకటించారు. శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు, శివశంకరశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, నాగపూడి చంద్రశేఖరయ్య, నోరి నరసింహశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీపాద గోపాలకృష్ణమూర్తిశాస్త్రి, వేపా రామేశం మొదలైనవారెందరో ఉపన్యసించారు. ఈ యుత్సవ సంచికగా ప్రకటింపబడిన భారతిమాడ సుందరంగా ఉండడమేగాక వివిధ వ్యాసములు, పలువురు విద్వాంసులు శాస్త్రజ్ఞులు, కవులు, పండితులు వ్రాసినవి కల్గి, పలు చిత్రములు కల్గి, 370 పుటలతో నలరారుచున్నది. దీనివెల రు 2-8 0. పుటలు తిరుగవేసి చూస్తే ఈధరచాలా స్వల్పమనిపిస్తుంది. వలయువారు భారతీ కార్యాలయానికి, 7 తంబుచెట్టివీధి, జి. టి. మద్రాసు అని వ్రాయండి.

---




## చిత్రాంగి

"చిత్రాంగి" ఈ మధ్య—అదివరలో ముద్రించే ముద్రణాలయం మూతపడడంచేత మూడు నెలల కాలం కన్పించింది కాదు. అంచేత చందాదార్లేగాక, ఎప్పటికప్పుడు కొనే వారున్నూ సంపాదకుని—శ్రీ ఎస్. జి. ఆచార్యగారిని దుయ్య పట్టారట. అయితే ఆచార్యగారు పత్రికా ప్రపంచంలో పేరు మోసిన వారు, దృఢసంకల్పులు కాబట్టి ప్రయత్నంచేత ఈ జనవరిలో తిరిగి వెలువరించారు. "చిత్రాంగి" పునర్దర్శనంతో పాఠకలోకం సంతుష్టమైయుంటుంది ఆచార్యాగారి అభిమానము చూరగొన్న నాయకాగ్రేసరులగు శ్రీ ఆచార్యారంగాగారి గంభీర చిత్రం ముఖపత్రమున చిత్రితమైయున్నది. లోపలంతా మంచికథలు. చిత్రములు—ఉన్నవి. ఆచార్యాగారి కలం పలుపోకడల నేర్చినది. అనేక విధములైన హాస్యరచనలతో యదార్థ పరమార్థాలు—వ్యంగ్యంగా విమర్శింపబడి రూపింపబడినవి అయితే కిట్టుచెప్పవలకన్నా మరికొంచం నాజూకైన వస్తువు చూస్తే బాగుండునని తోస్తుంది. తిరిగి ప్రచురమవుతున్న ఈ "చిత్రాంగి" పత్రికను—ఆచార్యాగారు త్వరలో వారపత్రికైనా చేస్తారని ఆశిస్తున్నాము. ఆంధ్రలోకం యధారీతిగా "చిత్రాంగి" నాదరించునని కోరుచున్నాము విడిపత్రిక వెల రు. 0-4-0, ఏడాది చందా రు. 3-8-0. కార్యాలయం: 1/33వరదరాజులు నాయుడురోడ్, ఎగ్మూరు, మద్రాసు.

## కుటుంబం

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రిగారు అప్పుడప్పుడు పత్రికలలో రచిస్తూ వచ్చిన కథలను కొన్నిటిని కూర్చి ఈ గ్రంథంగా తయారు చేశారు. అన్నీ సాంఘిక కథలే. మామూలుగా మనకు పత్రికలలో రోజూ కనపడే కథలే ఈ బుసుపోకకు చదవడానికి బాగా ఉపకరిస్తాయి. వెల రు. 1-0-0. వలయువారు పంతుల శ్రీరామశాస్త్రి బి. యస్‌సి. గారు, రాయఘడ్, కోరాపుటిజిల్లా బి. యన్. రైల్వే అని వ్రాయండి.

## విదుషీమణులు.

రాజమహేంద్రవరము ఆర్యాపుస్తకాలయంవారు ప్రచురించినారు. దీనిని రచించినవారెవరో తెలియుటలేదు. 'గ్రంధకర్త' అని మాత్రమే యున్నది. "వంగభాషయందు మణిలాల్ గంగోపాధ్యాయులు రచించిన గ్రంథము"ను ఆధారము చేసుకొని ఇతరములు చేర్చి ఈ పుస్తకము తెలుగున వచనముగా వ్రాయబడినది. కీ. శే, కోపల్లె హనుమంతరావుపంతులుగారు, బందరు జాతీయ కళాశాల స్థాపకులు, దీనికి "భూమిక" రచించిరి. కావున నిది 1920కి పూర్వమే వ్రాయబడి అచ్చైనదిగా తోచుచున్నది. దీనిని కొండ వెంకటప్పయ్యపంతులుగారికి అంకిత మొనర్చిరి పొరబాటున 'కొండ' 'కొండా' గా ప్రచురమైనది, ఇది శ్రీ పంతులుగారి కాగ్రహకారణమని వీరెరుగరుకాబోలు. దీనిలో వైదికస్త్రీలు, విశ్వవర, వాగ్దేవిప్రభృతి 1781 లో జన్మించిన మదిన సుభద్రమ్మ వరకు 60 మందికి మించిన పలువురు ప్రసిద్ధస్త్రీల జీవితములున్నవి, స్త్రీలు ముఖ్యముగా చదువదగినది. వెల రు, 0-12-0 మాత్రమే. వలయువారు: ఆర్యాపుస్తకాలయము. రాజమహేంద్రవరము, అని వ్రాయండి.

## జై హింద్ జాతీయగీతములు

వారూ వారూ వ్రాసినవన్నీ జతగూర్చి—కర్నూలు నగరంలో బాలసరస్వతిబుక్ డిపోవారు ఈ పుస్తకాన్ని అచ్చువేశారు. గ్రామములలో, పట్నాలలో మీటింగులలో పాడడానికి వీలుగా వున్నవి. వెల రు 0-6-0.

## యక్షప్రవాసము

కాళిదాస కృతమైన మేఘసందేశమునకు భాషాంతరీకరణంగా శ్రీ నున్నం వీరరాజ కవికృతమైన తెలుగు పద్యకావ్యమిది. దీని నిదివరలో దీపాల పిచ్చయ్యశాస్త్రి, గుర్రవెంకటసుబ్బరామయ్య ప్రభృతులు పలువురు తెల్గు గావించిరి. ఏదైనను— కాళిదాస కవి కృతమునకు ఇంచుకించుక సమీపమగునేగాని తత్ప్రతిబింబము కాజాలదు. అది కవిలోటు కాదు, అసలు తర్జుమాలోనే యున్నదారహస్యము. అయినను శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజకవిసార్వభౌమాది బిరుదాంకితులు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు "నేనీగ్రంధమంతయు సావధానముగా నాకర్ణించితిని. వీరరాజుగారి కవిత్వము నాతికఠినమై మృదుమధురమై మనోహరమైయుండును" అన్నారు. ఇక కావలసినదేమున్నది? వెల రు. 0-8-0, వలయువారు కవిపేర తునికి వ్రాయుడు.

## హిందూమూర్తిశతకము

శ్రీ వెలగల సుబ్బారెడ్డిగారిచే రచింపబడిన శతకమిది. ఈయన, బాలబ్రహ్మచారి అందు సహజ కవి అట. 'హిందూమూర్తి' ఈ కవి స్వకపోలకల్పితదైవము. ఇట్టిదైవము—అపూర్వశ్రుతము. తన హిందూత్వమునకే పేరిడినట్లు ముఖపత్రమందలి పద్యము తెల్పుచున్నది. అయితే 'హిందూమూర్తి'ని కొల్చు నీశతకమున మత పాషండత్వముగాక, సరళమైన నీతులే బోధింపబడినవి. ఈశతకమంతయు కందపద్యములు. కందము రచించిన వాడే కవియని గదా సూక్తి. వేమన సుమతిశతకముల శ్రేణిలో చేరజాలకున్నను నిర్దుష్టమైన శతకము. చిన్నబిడ్డలు నేర్వదగిన శతకము. దీనిని గుజిలీ అచ్చుపుస్తకములవంటి కాగితముపై నచ్చు వేయించినారు. ఇంకను మంచి కాగితములమీద అచ్చువేయదగినది. దీని వెల రు. 0 6-0 వలయువారు—గ్రంథకర్తపేర మార్టేరు, పశ్చిమగోదావరిజిల్లా అని వ్రాయుడు.

## జయహింద్ ప్రెస్ క్యాలెండరు

వీరి క్యాలెండరు రంగులతో చాల అందముగ నున్నది. అంతా ఇంగ్లీషే. కాని హిందువుల పండుగలు మున్నగునవి, రాహుకాలం సహా—సూచింపబడి యున్నవి. ఈ అచ్చు ఆఫీసు కర్నూలులో నున్నది. రాయలసీమలో నిట్టి అందమైన క్యాలెండరు నచ్చువేయుటకు తగిన వసతులుండుట హర్షింపతగినది.

## ఉపాధ్యాయ క్యాలెండరు

ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ వారు ప్రచురించిన క్యాలెండరు. 'ఫెడరేషన్' అనే అంత్యంలో ఉన్న సంస్థ కమ్యూనిస్టు సంస్థ—అని ఆంధ్రదేశంలో చెప్పనక్కరలేదు. అట్లాఅని కమ్యూనిస్టులు చేసే చర్యలు, ఉత్పత్తిచేసే పదార్థాలూ అన్నీ చెడ్డవి, పరిహారణీయాలు అనము. కాని పరీక్షించి మాత్రము స్వీకరించి వినియోగించాలి. పరీక్షిన్మహారాజు పండ్లు పుచ్చుకున్నట్లు పుచ్చుకోరానివి. నాగజెముడు పండ్లు ముళ్లుతీసి తింటే మేహశాంతి. ఇక, నీ క్యాలెండరు, చాలా అందంగా ప్రచురించారు; అదే వారిలో ఉన్న చాకచక్యము. 12 నెలలకు—వారు మహాత్ములనుకున్న తెలుగు పెద్దలను, ద్వాదశాదిత్యులలాగా నెలకొకరినిగా అమర్చి, వారి బొమ్మలనందు అచ్చువేశారు. నిజానికి—వీరేశలింగం, చిలకమర్తి, గురజాడ, గిడుగు, దామెర్ల, ద్వారం, కొమఱ్ఱాజు, గాడిచర్ల ఇత్యాదులు—అందరూ గొప్పవారు కాదా యేమి? ఇంకా ఎందరినో చేర్చేవారే, మరి 12 నెలలే అయెను! వలయువారు ఈ పేరిటి మాసపత్రిక ఆఫీసుకు క్రొత్తపేట గుంటూరు అని వ్రాయండి.

# గృహలక్ష్మి ఏజంట్లు:

—(★)—

గుంటూరు: వెల్కం & కో.
చిత్తూరు. వి. చెన్నకేశవులు నాయుడు.
కర్నూలు. బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడరన్ న్యూసు ఏజన్సి.
కాకినాడ: సి. హెచ్చి. నాగేశ్వరరావు.
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్చి. బాపనయ్య
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు
గుడివాడ: యం. రామమూర్తి పంట్.
పిఠాపురము: యం నూకరాజు.
కళ్యాణదుర్గం: కె మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు నూకరాజు.
బరంపురం కె.వి.రంగారావు
విశాఖపట్నం: కె. సుందరేశ్వరరావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. గంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
అనకాపల్లి: పి. వీరునాయుడు.
ఆకీడు: వి. లక్ష్మీనారాయణ
భీమవరం: యన్. సూర్యనారాయణ
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతీపురము ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల. రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
చల్లపల్లి: బి. ఆంజనేయులు.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్శిపట్నము. సి. రామం.
జంషెడ్పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ ముత్యాలు & సన్సు.
వేలూరు: ఎ. వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్ నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం: వి. వి. రంగాచారి

హిగిన బాతమ్ స్టాలులవద్ద దొరకును.

 ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును, డిపాజిటుతో దరఖాస్తుపంపుకొన కేం.

# శ్రీ సర్వధారినామ సంllర పుష్య, మాఘమాసములు.

జనవరి

1949-వ సంll

| | | |
|---|---|---|
| 16 | ఆ | వి. 43-51 అ 56-3 రా 2-1 యమ్మిగనూరు శ్రీ నీలకంఠేశ్వర రథోత్సవం. |
| 17 | సో | త. 38-29 పు 52-16 గురుమాధ్వవిరామః. |
| 18 | మం | చ. 32-15 పూష 48-6 ది 11-3 సంకష్టహరణగణేశవ్రతం. |
| 19 | బు | పం. 26-51 ఉఫ 44-1 శ్రీ త్యాగరాజఉత్సవం. |
| 20 | గు | ష. 21-5 హ 39-40 ది 3-32 తిథిద్వయం సత్యపరాక్రమ తీర్థపుణ్యదినం. |
| 21 | శు | స. 15-7 చి 36-9 అష్టమీతిథిః. |
| 22 | శ | అ 10-14 స్వా 33-1 రా 18-30. |
| 23 | ఆ | న. 5-51 వి 30-27 రా 12-14 |
| 24 | సో | ద. 2-1 ఉపరి-ఏకా॥ 57-0 స్మార్తానాం ఏకాదశి. |
| 25 | మం | ద్వా 57-30 జ్యే 28-8 వైష్ణవానామేకాదశి. |
| 26 | బు | త్ర. 57-14 మూ 28-52 ది 24-51. |
| 27 | గు | చతు. 58-20 పూషా 30-31 విద్యాధీశచరిత్ర పుణ్యదినం. |
| 28 | శు | అమా. ● 60-0 ఉషా 33-42 వ 11-7 అమాతర్పణం. |
| 29 | శ | అ.మా ● 1-12 శ్ర 38-0 రా 21-5 మకరేచాతుర్గ్రహకూటం. |

## మాఘ మాసము.

ఫిబ్రవరి 49

| | | |
|---|---|---|
| 30 | ఆ | శు పా. 5-1 ధ 43-12 మాఘ స్నానపురాణ శ్రవణారంభం. |
| 31 | సో | వి. 9-7 శత 49-18 ది 3 రబ్బీసానినెల. |
| 1 | మం | త 14-2 పూభా 55-54 ది 7-3 కైలాసగౌరివ్రతం. |
| 2 | బు | చ. 19-18 ఉభా 60-0 శూన్యతిథిః |
| 3 | గు | పం. 24-52 ఉభా 2-10 పంచమీతిథిః |
| 4 | శు | ష 30-9 రే 8-27 సుబ్రహ్మణ్యషష్ఠీః. |
| 5 | శ | స. 33-51 అ్వ 13-52 రథసప్తమీ. |
| 6 | ఆ | అ. 35-57 భ 18-1 రా 21-32 భీష్మాష్టమీ భీష్మతర్పణం |
| 7 | సో | న. 38-4 కృ 21-27 మధ్వనవమీ. |
| 8 | మ | ద 37-40 రో 23-12 ది 3-0. |
| 9 | బు | ఏ. 36-40 మృ 24 0 సర్వేషాం ఏకాదశి భీష్మైకాదశి |
| 10 | గు | ద్వా. 34 18 ఆర్ద్ర 23-30 భీష్మద్వాదశి. |
| 11 | శు | త్ర. 31-5 పున 22-9 రా 12-47 వరాహకల్పః |
| 12 | శ | చతు. 27-11 పుష్య 19-40 రా 22-9 హరిపదపుణ్యకాలం. |
| 13 | ఆ | పౌ ○ 21-9 ఆశ్లే 16-27 శో 39-0 తిథిద్వయం వ్యాసపూర్ణిమా. |
| 14 | సో | పా. 16-10 మ 12-50 ద్వితీయాతిథిః. |
| 15 | మం | వి. 10-37 పూఫ 8-56 ది 23-4. |

Printed and Published by Dr S Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras Editor · Dr. K. N. Kesari.

# సుమాంజలి

## కల్పవృక్షము

కావలి

నాకు బహిష్టకాలములో కడుపునొప్పిచే బాధ కలుగుచుండెను. మీ లోధ్ర 4 బుడ్లను తెప్పించి త్రాగినాను. అది మొదలు నాకు ఆరోగ్యముగనున్నది. బాధ తగ్గినది. లోధ్ర స్త్రీలవ్యాధులకు కల్పవృక్షము.

గునుపూడి కాంతమ్మ

## ప్రభావము వర్ణనాతీతము

తిరుచూరు - కొచ్చి

చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయరోగములచేత బాధ నొందుచుంటిని. అనేకవిధములైన చికిత్సలను పొందితిని గాని నివారణకాలేదు. కడపట తమ "లోధ్ర" సేవించిన వారమురోజులలోనే గారడివిద్యవలెగ మందు పనిచేసెను దాని ప్రభావము వర్ణింపజాలము.

అమ్మకుట్టిఅమ్మ
సర్కారు హైస్కూలు

## ప్రాణసంజీవి

బెంగుళూరు

గత సంవత్సరము మూడు నెలలకాలము తీవ్రమగు అతి మూత్రవ్యాధిచే బాధపడుచుంటిని ఎన్నియో యింగ్లీషు మందులను వాడి యీ వ్యాధికి మందేలేదని యెంచితిని. కాని 'అమృత'ను వాడిచూతమని ప్రారంభించితిని రెండుబుడ్లలోనే పూర్తిగ గుణమిచ్చినది. ఆరోగ్యము కలుగజేసినది. ఇది ప్రాణసంజీవి వంటిదని తప్పక చెప్పగలను.

జి. శ్రీనివాసఅయ్యంగారు
అమిల్ దారు, మైసూరుస్టేట్ సర్వీస్

## సర్వజ్వరములు

దేవగిరి

అనేకవిధములగు, జ్వరములకు "అర్క"ను వాడ మిక్కిలి గుణముగుపడెను

డాక్టరు వి. ఎన్. రావుగారు ఎల్. సి. పి. ఎస్.

## శస్త్రచికిత్స తప్పినది

కాకినాడ

నా భార్య చిరకాలమునుంచి పొత్తికడుపు యెడమభాగమున ఒక విధమైన శూలచే బాధపడుచుండెను. సదరునొప్పి ప్రతి రెండు గంటలకు మైకముతోకూడ వచ్చుచుండెను. ఈ జబ్బుకు ఆంగ్లేయ ఔషధములన్నియు వాడి విఫల మనోరథుడనైతిని. కడపట రాజమహేంద్రవరము మిషన్ హాస్పిటలుకు తీసుకొని వెళ్లితిని. డాక్టర్లందరు ఆమెకు వెంటనే మదరాసులో శస్త్రచికిత్స చేయనుండిన అపాయము జరుగునని చెప్పిరి. ఈ మాట వినిన వెంటనే మేము నిరాశ చెందితిమి. అదృష్టవశమున తమ లోధ్రను వాడవలయుననితోచి 'లోధ్ర' బుడ్డిని పంపమని తమకు తంతి పంపితిని. మొదటిపూట మందుతోనే వ్యాధి తిరుగుముఖమాయెను. రెండవ మోతాదుతో బాధలన్నిపోయి గాఢ నిద్రచెందెను. మరునాడు వుదయమున యిచ్చిన మందుకు నొప్పులన్నియు మాయమై మంచి ఆరోగ్యవంతురాలాయెను. లోధ్ర శస్త్రచికిత్సను తప్పించెను.

పి. సుబ్బరాయుడుగారు
డిస్ట్రిక్టు యింజనీరు ఆఫీసు

## మేలైన టానిక్

ఆరువాకం

ఆరోగ్యమును చేకూర్చుటకు "అమృత" మేలైన టానిక్కని నా యనుభవమువలన తెలుసుకొంటిని.

పేరూరి సూర్యనారాయణగారు
జమీందారు

## క్వైనును లాభించలేదు

కందుకూరు

నేను కనిగిరిలో నుండినప్పుడు, 700 గ్రెయినుల క్వైనెను మలేరియా జ్వరమునకు వాడితిని కాని ఫలితములేదు. "అర్క" వాడగనే జ్వరము నిలిచినది.

ఆర్ దొరస్వామి అయ్యరుగారు
తహసీల్దారు

